ఖర్చవుతుందని ఒకటే అడగబోయి అజీర్ణం చేస్తుందని అదీ మానేసింది కోనేరు కడుపుకోక గళ్లా తగిలించి కప్పన్నర కాఫీమాత్రం అందులో పోసి గళ్లా పారేసి కడుపుని దాచేసి చర్మతలుపు మామూలుగా మూసేసి లాల్చిబొత్తాయిలూ ఆఖర్కి కోటుబొత్తాయిలూ కోనేరు వెళ్ళి మళ్ళీ కుర్చీలో కూలబడింది.

మళ్ళీ టేబిలుమీద తల. మళ్ళీ గడియారంమీద కళ్ళు. సాయంత్రంకోసం కుర్చీవీపున కోటు. మళ్ళీ ఆఫీసు ఫైల్సు మళ్ళీ మామూలుప్రకారం తిరిగేమర. క్రమక్రమంగా కరిగిపోయే కాలం క్రమంగా తనకు తెలియకుండానే అలసి, ఎడమచెయ్యి ఊడిపోయి కింద పడిపోయింది. కుడిచెయ్యి మాత్రం రాజపుత్రవీరుని కరం యుద్ధరంగంలో కత్తిని వదల నట్లు కలాన్ని వదలకండా గట్టిగా కాళ్ళ స్క్రూలు సరిగ్గా లేవు, కీళ్ళు పట్టు తప్పిపోతున్నాయి: సంధ్యావేళ సాక్షాత్క రిస్తే బాగుండును. నా ఎడంకాలు ఎక్కడకో వెళ్ళిపోయింది. సాయంత్రందాకా సెలవిచ్చేశాను. ఈ మరలో భాగాలు ఎక్కడి వక్కడ ఊడిపోతున్నాయి. వీటికి నా సెలవుకూడానా వీటికి నా లక్ష్యంలేదు.

గడియారం మొగంమీద సాయంత్రం కనిపించిన మీదట కోనేటిగావుపంతులు మళ్ళీ మనుష్యరూపం ధరించి గృహోన్ముఖుడయినప్పుడు ఎదురుగుండా పశ్చిమాకాశం మీద ఇంకోదినం దగ్ధమయి పోయిందనే సూచనగా ఎర్రని మంటలు కనబడ్డాయి.

---

[6]

# కోనేటి రాత్రి

పగటి కోనేటిరావు వేరు. స్థూలకాయుడు. జీవిత మధ్యాహ్నం గడిచిపోయిన వాడు. హెడ్డు గుమాస్తా. బండెడు కుటుంబం. జటావల్లభుల కోనేటిరావు పంతులుపేరు పేపర్లలో కనబడదు. రేడియోలో వినబడదు. అతని పగళ్ళన్నిటికీ ఆకారం ఒక్కటే.

రాత్రి నిద్రపోతూన్న కోనేటి కళ్ళ వెనకనుంచి అతని అపస్మార మనస్సులోని స్వప్న విన్యాసాలు చూదాం రండి.

"సినీమా ప్రపంచానికొక కొత్త వెలుగు. కథానాయకుని నటనానైపుణ్యం అమోఘం, అద్వితీయం, అవాఙ్మానసగోచరం! ఆజానుబాహువు. సౌందర్యాపరిమత్స్యలాంఛనుడు. మన కోనేటిరావు కథానాయికను దుర్గమారణ్యాలనుండి సింహ శరభ శార్దూల గవయ గండకాది భయంకర జంతుజాలంనుంచి తప్పించి సురక్షిత స్థానం చేర్చాడు. నాయిక కృతజ్ఞత జాలువారే కళ్ళతో చూస్తోంది. ఆమె కళ్ళలోనికి తానుకూడా అనురాగంగా చూస్తూ- పాట! సంగీతం. సినీమా సంగీతం. జంత్రగాత్రముల రాల్గరగించు విమల గాంధర్వం అందుకున్నాడు కోనేటిరావు."

* * * *

చేతిపిల్లడు నిద్రలో జడుసుకుని కెవ్వుమని ఏడిస్తే నిద్రాభంగ మయింది కోనేటిరావుకి.

"ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం అల్లకల్లోలంగా సాగిపోతోంది. సముద్ర భూమ్యాకాశాలు యుద్ధ సంరంభంతో ఘూర్ణిల్లిపోతున్నాయి. అట్లాంటిక్ మహాసముద్రాన్ని చీల్చుకుంటూ వస్తూన్న ముప్ఫయి అయిదు వేల టన్నుల బ్రిటిష్ యుద్ధ నౌకను చూశాడు జర్మన్ సబ్మెరిన్ కమాండర్ జటావల్ కోనేట్. వెంటనే దాన్ని టార్పిడో చెయ్యమని తన పరివారాని కుత్తరువిచ్చాడు: వెల్టాన్ షౌంగ్ డెర్ అంటర్ డెన్ లిండెక ! గెస్టాల్ డెర్ డాయిష్లాండ్ ఊబర్ ఆల్స్ ! మంచినీళ్ళ ప్రాయంగా జర్మన్ భాష మాట్లాడేస్తున్నాడు. తునా తునియలయి పోయింది యుద్ధ నౌక. అందులోని నావికులు చిన్నచిన్న పడవలలో ప్రాణాలు రక్షించుకొనబోతూ ఉంటే వాళ్ళమీద మెషీన్ గన్లు పేల్చమని ఆర్డరు వేశాడు కమాండర్ కోనేట్. ఫోల్కి-పేర్ బియో బాక్టర్ ! గెహెన్నా! ఆఖ్ టంక్! జైట్ గ్రోస్ట్! మైన్ కాంఫ్."

పిల్లి పాలగిన్నె పడదోసిన చప్పుడు. కోనేటిరావుకి మెలకువ వచ్చింది.

* * *

"గంగానది మొదలు కావేరీనదివరకు భారతదేశంలోని అన్ని నదులనూ కలిపి ఆనకట్టలు కట్టిన అసాధరణ ఇంజనీరింగ్ జీనియస్ కు అమెరికా స్వాగతం ఇస్తోంది. మా టెన్నెస్సీలోయ తమరు పరిశీలించాలి. అమూల్యమైన మీ సలహాలు శిరసావహిస్తాము. సిఫారసులు తక్షణమే అమలు చేస్తాము ... ... ... అబ్బే! అదెంతమాట! అల్పజ్ఞణ్ణి

నన్నేదో పెద్దవాణ్ణిచేసి పొగుడుతున్నారు. నామాత్రం తెలివైనవాళ్ళు మీ అమెరికాలో లేకపోయారా ? అంతదూరం నించి ప్రత్యేకం నన్నిక్కడికి ఆహ్వానించడం మీ ఔదార్యాన్నే చాటుతోంది. అయినా ఈ సన్మానం నాదికాదు. ఆంధ్రదేశానికీ గౌరవం. జై, ఆంధ్రమాతకు జై !"

ఇంకో కుర్రాడి ఏడుపు.

* * * *

"మళ్ళీ సత్యాగ్రహోద్యమం ప్రారంభమయింది. ఎన్ని సత్యాగ్రహాలు చేసినా ఈ యింగ్లీషువాడు మనల్ని వదిలిపెట్టేటట్టు లేడు. ఈసారి దీని అంతు చూడవలసిందే. కేవలం అహింసనే పాటిస్తూ కూచోకూడదు. మహారాజశ్రీ జటావల్లభుల కోనేటిరావుపంతులు ఆఫీసు బీరువాలు విరక్కొట్టేస్తున్నాడు. కుర్చీలూ, బల్లలూ గుండపిండి చేశేస్తున్నాడు. కాగితాలు తగలబెట్టేస్తున్నాడు. సిరాబుడ్లు గోడలకివేసి కొట్టేస్తున్నాడు. కలాలు విసిరిపారేస్తున్నాడు. ఎదురుగుండా దొరగారువస్తే గూబ గింయి మనేటట్టు వాడికొక లెంపకాయ యిచ్చుకున్నాడు. ఒక పెద్ద పేపరు వెయిటుతీసి ఆఫీసు గోడ గడియారాన్ని గురిచూసి విసిరాడు."

తెల్లారిపోయింది నాన్నా !
కోనేటి నిద్ర కొండెక్కిపోయింది.

—

# కోనేటి జన్మ

నేడు సుదినం. నేడు కోనేటిరావు జన్మదినం.

మహారాజ రాజశ్రీ హెడ్డు గుమస్తా జటావల్లభుల కోనేటిరావు పంతులుగారి నలభై అయిదో జన్మదినం ఈరోజన్న సమాచారం మరా రాశ్రీకే తెలియదు. కోనేటి జన్మదినం జాతీయ పర్వదినం కాదు. దీనికొక ప్రత్యేకత నాపాదించి పండుగ చేసుకోవలిసిన అవసరం కోనేటిరావుకే లేకపోయింది. తూర్పు ఆసియా దేశాలలో ప్రళయం, పశ్చిమ యూరప్ దేశాల ప్రణయం, మధ్య ప్రాచ్యంలో మంత్రసాని గండం మొదలైన ప్రపంచప్రచండవార్తల మధ్య ఇదివర కెప్పుడో నలభైనాలుగేళ్ళ కిందట కోనేటి రావనే ఆసామీ ఒకానొక పల్లెటూళ్లో జన్మించాడన్న కబురు, ఈ రచయితని తప్ప యింకెవ్వరినీ ఉత్సాహపరచ లేక పోయింది.

అయినా ఈ దినం కోనేటిరావు పుట్టిన రోజని తెలిసి నప్పటికీ ఈ రచయిత "డాండ డడాండ డాండ నినదంబు లజాండమునిండ మత్తవేదండము నెక్కి—" ఈ సంతోష వార్తని చాటలేకపోతున్నాడు. దీన్ని ఎలా వర్ణించాలో తెలియక ఇబ్బందిపడుతున్నాడు. "నేడు సుదినం" అని మాత్రం అని ఊరుకున్నాడు. ఇది ఎందేత సుదినమో ఈరచ యితకికూడా తెలియదు.

కిందటేడు కూడా ఇలాగే నలభై నాలుగోకోనేటి మైలురాయి నామమాత్రానశిష్టమైపోయింది. మీాదటికైనా

ఇంతకన్న ఉత్తమపరిస్థితులలో కోనేటిరావు పుట్టినరోజు పండుగ చేసుకోగల సూచనలు సుతరామూ కనిపించవు. ఈ లోపున అమెరికాలో కొందరి పెద్దల ఆశీర్వాదమువల్ల యుద్ధమే వచ్చేస్తే, సరి! మరి కోనేటిరావే కనిపించడు.

కోనేటిరావుగారి నలభై అయిదో జన్మదినంనాడు వాళ్ళ ఆఫీసుకి సెలవు లేదన్న విషాదవిషయం ఒక్కటి మినహాయిస్తే తతిమ్మా లాంఛనాలన్నీ - కోనేటిరావుకి తెలియకండా - సక్రమంగానే జరిగినట్లు చెప్పవచ్చును. తెల్లవారుజామున మలయానిలం మందమందంగా ప్రసరించింది. అదృష్టవశాత్తూ ఇది వసంతకాలం కావడంవల్ల మామిడిచెట్లు చిగిర్చడం, ఆ చిగుళ్ళు మెసవి కొన్ని కోకిలలు పంచమస్వరాన్యంగా వగర్చడం జరిగింది. తిరుచునాపల్లి రేడియోలో యెవరో సుప్రసిద్ధ సోదరులు మంగళవాద్యాలు మోగించారు. చాలా రోజులనించీ సాక్షాత్కరించని చాకలివాడు (చిరిగిపోయిన వైతేనేం) బట్టలన్నింటినీ బాకీపెట్టకండా తీసుకొచ్చాడు. మరి ఆవిడకి తెలిసే చేసిందో తెలియకే చేసిందో తెలియదు గాని కోనేటిరావుభార్య బహురుచ్యమైన పిండివంటలు చేసి ఆఫీసువేళకి ముందుగా వడ్డించింది. మస్తుగా భోజనం చేసి అవిఘ్నమస్తుగా కోనేటిరావు ఆఫీసుకి చేరుకున్నాడు.

కోనేటిరావు ఆఫీసు యాత్రని కొండొకచోట ఈరచయిత ఇదివరకు వర్ణించాడుగాని పునరుక్తి అవుతుందనికూడా వెనుదీయకండా ఆ ప్రయాణాన్ని మళ్ళీ వర్ణించవలసి కితడు

ఉచ్ఛ్వాసిస్తున్నాడు. అసలే కూర్మావతారం. అరమైలు ఆఫీసు దూరం రొప్పుతూ రోజుతూ కోనేటిరావు ఇంటినుండి ఆఫీసుకి బయలు వెడలెను. "వెడలెను కోదండపాణి" అని గాని, "రాజు వెడలెరవి తేజము లలరగ" అని గాని ఈ వెళ్ళడాన్ని ఎవ్వరూ పాడడానికి సాహసించరు. ఒక గుమస్తా తన పుట్టిన రోజున ఆఫీసుకి వెళ్ళాడన్న విషయంలో సంగీతాన్నీ కవిత్వాన్నీ ప్రోత్సహించే పరిశ్రమం యత్నించిత్తూ ఉండనేరదు. ఆపసోపాలు పడుతూ ఆఫీసుకి పోతున్న ఒక మానవుడి మహాప్రస్థానం సౌందర్యవంతమైన సంఘటన కాదు. ఇదేమీ హైదరాబాదు ప్రతినిధుల పారిస్ ప్రయాణంకాదు. ప్రధాన మంత్రిగారి సరిహద్దు పర్యటన కాదు. కోనేటిరావు అరమైలు దూరాన్ని అవలీలగా లంఘించి శాశ్వతంగా ఒక కొత్తరికార్డు స్థాపించాడనడం సత్యానికి అనేకలక్షల మైళ్ళ దూరం. కోనేటిరావు రోజూలాగే ఈరోజుకూడా ఈసురోమంటూ జీవిత సముద్రంలో ఈదుతున్నాడు. ఇదేమీ రసవంతమైన సన్నివేశం కాదని ఈ రచయిత ఇంకోసారి మనవి చేసుకుంటున్నాడు.

కోనేటిరావు జీవితరంగంలో ఏమూలనుంచి కూడా ఏమాత్రమూ కవిత్వమనేది ప్రసరించకుండా కట్టుదిట్టాలు జరిగిపోయాయి. ఎందుచేత అని ప్రశ్నిస్తే ఏజవాబూ రాదు సరికదా ఎన్నో ప్రశ్నలు బయలుదేరుతాయి.

ఏ శాపంవల్ల కోనేటిరావు తన నలభై అయిదో పుట్టినరోజు హాయిగా ఇంట్లో కూర్చోకుండా ఎండలో ఈదవలిసి వచ్చింది? అతని పిల్లల చొక్కాలూ లాగులూ అతుకుల బొంతలు కావడానికి కారణ మేమిటి? దాక్షిణ్యంలేని ఏ దుర్విధిశాసనంవల్ల కోనేటిరావు తలమీద చాలామట్టుకి జుట్టు ఊడిపోయి బట్టతల ప్రాప్తించడమే కాక ఉన్నజుత్తూ తెల్లబడిపోయింది? అతని చెమటతో తడిసిన రూపాయలకి అర్థం లేకపోవడం ఎంచేత?

ఏం ప్రయోజనంలే ఇలాంటిప్రశ్నలువేస్తే!

కోనేటిరావు తన నలభై అయిదో పుట్టినరోజున ఆఫీసులో కుర్చీలో కూర్చుని పనిచేసుకుంటున్నాడు. ఇదివరకు అతణ్ని కనబడకుండా బంధించిన సంకెళ్ళు ఇంగ్లాండులో తయారైనవి. ఇప్పటి సంకెళ్ళను ఇండియా తయారుచేస్తోంది. ఇవి స్వదేశీ సంకెళ్లు.

ఏమైనా ఇది సుదినం. ఇది కోనేటిరావు జన్మదినం.

---



# బొమ్మ

## బొమ్మ

మరి నేనుచెబితే నమ్మరు కాని, నాకు చెప్పకతప్పదు. ఆబొమ్మ నన్ను కొనమని మరీ మరీ అడిగింది. నేనూ మొదట నమ్మలేదు. ముందుకి సాగిపోయికూడా జేబులోంచి. చర్మంలోంచి గుండె తడిమి నట్లనిపించింది. వెనక్కి వచ్చి, పిలుపు విని, ప్రార్థన ఆలకించి బేరమాడకుండా వాడెంత చెప్పాడో అంతకూ తీసుకున్నాను బొమ్మని. ఎవరు హర్షిస్తారు ఈ నాచర్యను. బుద్ధిపుట్టగానే ఏ సారాకొట్లో దూరేవారో- ఊహ తట్టగానే చెరువులో పడిపోయేవారో?

టేబిలుమీద బొమ్మను అలంకరించాను. నా నలుగు రైదుగురు స్నేహితులూ నాయింటికి రావడం మానేశారు. నా అభిరుచిని అభినందించమని వారిని కోరలేదు నేను. వాళ్లుకూడా కారణాలు చెప్పలేదు. అప్పుడప్పుడు బొమ్మను చూచినప్పుడు నాక్కూడా ఎందుకు కొన్నానా అనిపించేది. నిజంగా నన్నడిగిందా లేదా? బొమ్మ నన్ను మోసగించిందా? లేక నన్ను నేనే మోసగించుకున్నానా? ఈ నిర్జీవప్రతిమకు ఇంతశక్తి నేనే ఆరోపించి ఉండాలి, లేక నా నిమిత్తం లేకుండానే ఇంకొకళ్ళని అడిగి, ఆకర్షించుకుని కొనిపించుకునే దేమో కొంటెరకం! నేను అదృష్టవంతుణ్ణి కాబోలునని అనుమానం కలిగింది. ఎందువల్లనంటే, ఈబొమ్మ నా టేబిలు మీద కూర్చున్నప్పటినుండి నా సిగరెట్లు ఖర్చుతగ్గిపోయింది. అప్పులన్నీ తీర్చివేశాను. రెండు మూడు మణియార్డర్లు వచ్చాయి. ఇంక కొన్నాళ్ళు చూసి బ్యాంక్ అకౌంట్ ప్రారంభించా లనుకుంటున్నాను. చాకలివాడు మూడురోజు లకే బట్టలు తెచ్చాడు. పద్దుపుస్తకం వెంటనే దొరికింది. మాయింట్లో పిల్లులు దెబ్బలాడుకోడం మానివేశాయి. (బహుశా అది కేవలం తాత్కాలిక యుద్ధవిరామసంధి అయినా కావచ్చును.)

నాకాలంలో నూటికి తొంభైవంతులు వీధిలోనూ, పదివంతులు ఇంటిలోనూ గడపడానికి అలవాటు పడ్డ నేను సెబాస్, ఇప్పుడు ఆదర్శగృహస్థుణ్ణయాను. మరేముంది, ఈనాడు నాకంటె సంతుష్టుడీమూడుజగంబుల పూజ్యుండు!

చెడిపోతున్న వాళ్ళను క్షమించకూడదనీ, జీవితమంతా సిరాబుడ్డిలోనే గడపకూడదనీ, ఉన్నతాశయాలను తోరణాలుకట్టి మెళ్ళోళ్ళమాత్రమే వేసుకోవాలనీ, వేళపట్టున నిద్రపోవాలనీ నిశ్చయించుకున్నాను.

అన్నిటికన్నా గొప్పసంగతి సొంతంగా ఆలోచించడం మానివేశాను. గొప్పబెడద వదిలిపోయింది. బొమ్మచేతిలో కీలుబొమ్మనై పోయాను. రూళ్ళుగీసి కాపీలు రాసుకుంటుంది నామీద. తెల్లకాగితంలాగ పడుక్కుంటాను నేను.

ఉదయం కాఫీ ద్రావకంలో ప్రతిబింబించే నాముఖం నాకెంతో కృతజ్ఞత కనబరుస్తుంది. నేను నవ్విన నవ్వును మళ్ళీ నాకు ఇచ్చివేస్తుంది. మధ్యాహ్నం భోజనానంతరం ఇదే అనుభవం. తాంబూల చర్వణం చేస్తూంటే అద్దంలో నాముఖం నెమరువేస్తుంది. నాకళ్ళు కుశలప్రశ్నలు వేస్తాయి. రాత్రి మంచం భావగీతం పాడుతుంది. గడియారం జోకొట్టుతుంది.

నాకు శిల్పమన్నా శిల్పులన్నా విసుగు పుట్టిపోయింది. ఈబొమ్మను తప్ప ఇంకదేన్నీ మెచ్చుకోవలిసిన అవసరం లేదని రూఢి అయిపోయింది. ఏలోపం లేకండా తీర్చి దిద్దినట్లుగా ఉండడమే దీనిలోపమని నా శిల్పిమిత్రుడొకడు విమర్శించాడు. నిజాన్ని వక్రోక్తితో చెప్పడమే శిల్పానికి పరమార్థం అన్నాడు. చర్మచక్షువు ఇచ్చేసాక్ష్యం అసమగ్రమని వాదించాడు.

నేను చాలా ఓప్పుతో విన్నాను. నాకు వాడిమాటలు బోధపడలేదు. నాబొమ్మని చూసి ఈర్ష్యతో అంటున్నమాట లని మాత్రం నిశ్చయించుకున్నాను. ఏమయినా వాడు బుకా యింపులో నేర్పరి. నాకు వాదించడం చేతగాదు. చాలా పారిభాషికపదాలతో నన్ను బోల్తా కొట్టించాడు. కొంతదాకా ఈడిగిలబడ్డాను—కలర్, కాంపోజిషన్, పెర్స్పెక్టివ్ అంటూ. ఉప్పెనలాగ వాడు తిరగబడి డైనమో, వెర్టిగో, పెనంబ్రా, క్యూబా అన్నాడు. నాకు జబ్బుచేసి ఇప్పుడే పథ్యం తింటున్నాను.

బొమ్మ మాట్లాడుతుందా అని కొందరు వేసే చచ్చు ప్రశ్నకి జవాబివ్వకండానే మాయిద్దరిమధ్యా జరిగే సంభా షణను దాచవలిసినంతమాత్రం దాచి, మిగిలినది బైట పెడుతున్నాను. "...అని నువ్వన్నప్పుడు నాకు సిగ్గేసింది. నీకెందుకు పోనిస్తూ." "ఊరుకోకూడదు. ఇవాళ ఇదయింది రేపు మరొక టవుతుంది. చిన్నపామునైనా పెద్దకర్రతో కొట్టాలి."

"నలుగురితో చావు పెళ్ళితో సమానం."

"నలుగురితో పెళ్ళి చావుతో సమానం."

ఈవిధంగా మా సంభాషణ సాగుతూవుంటుంది. ఇం దులో బొమ్మమాట లేవో నామాటలేవో అడగవద్దు. ఐనా బొమ్మతో సంభాషణ ఇలాగే వుంటుంది. నామాటలు బొమ్మ వైనా బొమ్మమాటలు నావైనా మించిపోయిందేదీ లేదు.

చేసుకున్న పాపంలాంటిది కొనుక్కున్న బొమ్మ.

---




# అశ్వమేధయాగం

"అమ్మకి ప్రాణంమీదికొచ్చింది. వెంటనే బయల్దేరు - రామం."

తమ్ముడిచ్చిన టెలిగ్రాం చదువుకున్నాడు వెంకటేశ్వర్లు. ఒక్కక్షణంమట్టుకు మనసులోని ఊహాలన్నీ స్తంభించి మెదడు శూన్యమయింది. కత్తివేటుకి చర్మం తెగితే వెంటనే రక్తంరాదు. రక్తం రావడం ప్రారంభించడంతో వరదగా ప్రవహిస్తుంది.

ఊహలు వరదలుగా ప్రవహిస్తున్నాయి. "...... అమ్మ చచ్చిపోతుంది కాబోలు. సాయంత్రం మెయిలులో బయల్దేరాలి. వెళ్ళేదాకా ఉంటుందో ఉండదో! రేపు వెళ్ళితే? ముసిలిప్రాణం. రేపటిదాకా నిలుస్తుందా? అయినా

ఇవాళ బయల్దేరడానికి వీలులేదు. రేపు వెళ్ళవచ్చు చచ్చి పోదు. ఫరవాలేదు. రేపే వెళతాను. మరి డబ్బు?"

తలకాయలో పందెపుగుఱ్ఱాలు పరుగెత్తుతున్నాయి.

డబ్బుసంగతి తలలో మెదిలిన వెంటనే "ఈ టెలిగ్రాము తోనే డబ్బు పోగుచెయ్యొచ్చు" ననే ఊహ పుట్టింది. ఒక చోటుకాదు. పదిచోట్ల సొమ్ము చెయ్యొచ్చు. తల్లి చచ్చిపో తోందంటే డబ్బు బదులివ్వని కఠినహృదయులుండరు. నలుగు రైదుగురు బిర్రబిగిసినా ఐదారుగురైనా ఇచ్చితీరుతారు. సుమారు నూరుగూపాయలు పడతాయనడానికి సందేహం లేదు.

వెంటనే బట్టలు వేసుకున్నాడు. దమ్మిడీఅయినాలేదు. దగ్గరలో ఉన్నవాడూ, అడగ్గానే అప్పుయిచ్చేవాడూ ఎవరని ఆలోచించాడు. మరెవరు? సత్యనారాయణ ఉన్నాడు. నాలుగువీధుల అవతల నరుమను పోవచ్చును. ఈ కష్ట సమయంలో పెళ్ళాం మెళ్ళో నగ తాకట్టు పెట్టిఅయినా డబ్బు తెమ్మని అడగదగినంత చనువూ, అవకాశంఉన్నాయి.

"సత్యనారాయణగారూ!"

"ఇంట్లో లేరండీ"

ఏం అపశకునం! ఇంత పెందరాళే ఎక్కడికి వెళ్ళి పోయాడో? అన్నట్లు టెలిగ్రాము గదిలో వదిలిపెట్టలేదు కద. జేబు తడుముకున్నాడు. ఉంది. జేబులోనే ఉంది.

మరి ఈసత్యనారాయణ ఎక్కడ దొరుకుతాడు? కాఫీ క్లబ్బులోనా? తనజేబులో రెండణాలయినా ఉంటే బాగుండును. అబ్బే కాఫీక్లబ్బుకి వెళ్ళడు. "ఇంట్లో కనుక్కుందాం. చెప్పి వెళతాడా? ఏమో - అడిగిచూదాం."

"రైల్వేస్టేషను కెళ్ళారండి. వచ్చాక మీరొచ్చినట్లు చెబుతాను." ఇంట్లోనుండి జవాబు

వీధికొసని తనకి తెలిసిన సోడాదుకాణం నాయరు దగ్గర ఒకపావలా తీసుకున్నాడు వెంకటేశ్వర్లు. బస్సులో పడ్డాడు. నిలబడే ప్రయాణం చేశాడు. గుర్రాలు మరీజోరుగా పరుగెత్తుతున్నాయి మనస్సులో.

ప్లాటుఫారంమీద సత్యనారాయణని కలుసుకున్నాడు. ఇంకా మెయిలు రాలేదు "మా బావమరిది వొస్తున్నా"డని సత్యనారాయణ ప్రకటించాడు.

ఎలా ప్రారంభిస్తే బాగుంటుంది? "మీ యింటికి వెళితే నువ్వు లేవు అర్జంటు పనిమీద వొచ్చాను" అంటే? బడి కుర్రాడు పెన్సలు గీతలు రబ్బరు పెట్టి తుడిచివేసినట్లు మనస్సులోంచి ఈ మాటలను తుడిచివేశాడు. ఏమీ అనకుండా జేబులోంచి వైరు తీసి సత్యనారాయణ కిచ్చాడు.

"అరే, పాపం! మీ అమ్మకి జబ్బుగా ఉన్నట్లుకూడా వినలేదే!"

"వృద్ధాప్యమే జబ్బు. బతకదు లాభం లేదు. సాయంత్రం మెయిలుకి పోదామనుకుంటున్నాను."

సత్యనారాయణచూపులు శూన్యాన్ని చిన్నచిన్న పీలి కలుగా తుంచుతున్నాయి. "వెపదామంటే డబ్బు లేదు ... ..."ఎవ్వరో నూతిలో పడిపోయినట్లు ఈ మాటలన్నాడు వెంకటేశ్వర్లు తొందరగా.

సత్యనారాయణ కుడిచేతి బొటనవేలినీ చూపుడు వేలినీ చూచి నుదుటిని పట్టుకొని "పాతికరూపాయలేనా ఉండాలనుకుంటాను" అన్నాడు.

"ముప్పైరూపాయలు కావాలి. నువ్వేఇవ్వాలి. ఎంత ముంచుకొచ్చినా ఎవరినీ నోరువిడిచి అడగలేను."

సత్యనారాయణది త్వరగా కరిగిపోయే గుండె. నగ తాకట్టుపెట్టి ఇస్తాననిపించడానికి వెంకటేశ్వర్లుకి ఐదు నిమి షాలకంటె ఎక్కువ పట్టలేదు. మధ్యాహ్నం రెండు గంట లకి మీ ఆఫీసులో కలుసుకుని సొమ్ము తీసికుంటానని చెప్పి వెళ్ళిపోయాడు వెంకటేశ్వర్లు.

* * * *

నరహరిసెట్టిదగ్గర పదిరూపాయలు సంపాదించే సరికి తలప్రాణం తోకకు వచ్చింది.

* * * *

టాక్సీ చేయించుకుని మైలాపూరు బ్యాంకుకి వెళ్ళాడు వెంకటేశ్వర్లు. బ్యాంకు గుమాస్తా కామేశం స్నేహితుడు కాడు గాని పరిచయస్థుడు. ఇలాంటి సన్నివేశాలలో స్నేహం కన్న పరిచయమే డబ్బు పలికిస్తుంది.

బ్యాంకులో అరగంట వ్యర్థమైపోయింది. దమ్మిడీకూడ పెగలలేదు. టాక్సీని పంపించివేశాడు. అనవసరంగా డబ్బు వేటకి ఎక్కువపెట్టుబడి పెట్టకూడదని నిశ్చయించాడు.

ఇద్దరు ముగ్గురు వకీలు స్నేహితుల ఇళ్ళకి నడుచుకుంటూ వెళ్ళాడు టెలిగ్రామ్ చూపించి ఒకచోట ఇరవై, ఇంకొకచోట ఇరవై ఐదూ పిండుకున్నాడు.

*　　*　　*　　*

మధ్యాహ్నం పండ్రెండు గంటలికి జేబులో డెబ్బయి అయిదురూపాయల జమ.

గుర్రాలు జోరుజోరుగా పరుగెత్తుతున్నాయి. సత్యనారాయణఇచ్చే ముప్ఫయి రూపాయలూ కలుపుకుని నూటఐదురూపాయలవుతాయి. ఇవాళ గిండీకి వెళ్ళిపోతాను. గుర్రపు పందాల ఆఖరిరోజు. చీకటితోనే ఎక్స్‌ప్రెస్ ఎక్కేస్తాను.

"రెండు మూడు వందలేనా గెలవక పోతానా" అనుకున్నాడు వెంకటేశ్వర్లు నిన్న సాయంత్రం కొన్న "రేసింగ్ గైడు" కోటులోపలి జేబులోంచి పైకి తీశాడు. సైంటిఫిక్‌గా ఆలోచించి గుర్తులు పెట్టుకున్న గుర్రాలపేర్లు మరోమారు మననం చేసుకున్నాడు, ఇవాళ నువ్వు గెలిచి తీరుతావని ఎవరో రక్తంలోంచి సందేశాలు పంపుతున్నట్లనిపించింది.

"మరి ఇంటికి వెళ్ళను. భోంచెయ్యాలని లేదు టిఫిన్ తీసుకుని సత్యనారాయణ ఆఫీసుకి. అక్కణ్నుంచే పార్కు స్టేషనకి."

ఎలక్ట్రిక్ ట్రెయిన్‌లో కూచున్నాడు. ట్రెబిల్ ఈవెంట్‌లో ఏడెనిమిది వందలొస్తే ఇవాళ చేసిన అప్పులన్నీ ఈ సాయంత్రమే తీర్చేస్తాను. కిందటి రేస్‌లో ఈనెల జీత మంతా తగలేశాను. అనుకున్న గుర్రాలని ఆడకండా ఎవరో చెప్పినమాట వింటే ఏమవుతుంది మరి?

"ఇవాళ ఫరవాలేదు. కళ్ళు మూసుకుని ఆడేస్తాను. పుట్టమీద పెట్టినట్టు డబ్బొచ్చేస్తుంది. ఫూల్‌ప్రూఫ్‌గా ఆలోచించాను. సైంటిఫిక్‌గా అంచనా వేశాను. ఇవాళ నేను ఓడిపోవడానికి వీలులేదు."

* * * *

వెంకటేశ్వర్లు సాయంత్రం గిండీనించి మరలి వస్తున్నప్పుడు అతని జేబులో తొమ్మిదణాల చిల్లరడబ్బులూ, రెండు సిగరెట్లున్న విల్సు పాకెట్టూ, ఉదయం అందిన టెలిగ్రామూ మాత్రం మిగిలాయి. అతనెంత సైంటిఫిక్‌గా ఆలోచించ గలిగినవాడైనా గుర్రాలకి ఆ సబబు లేవీ తెలియకపోవడమే అతని పరాజయానికి కారణం.

---




కథ వండుదామని కలం పట్టుకుని కాగితాలు పెట్టుకుని కూచున్నాను. ఇతివృత్తాన్ని ఎసరుమీది కెక్కించాను. కథానాయకుణ్ని ముక్కలుగా తరిగి కారప్పొడి జల్లి పచ్చడి చెయ్యాలనుకున్నాను. ఇందుకు ఎవరు అనుమతిస్తారా అని జ్ఞాపకం ఉన్నంతమట్టుకు సాహిత్యాన్ని గాలిస్తున్నాను. కథానాయకులందరినీ ఇదివరకే సినీమావాళ్ళు పచ్చడి చేసి సంచేసుకున్నారు నాకొక్కడినీ మిగల్చకండా. సరే. కథానాయకుడి మాట తర్వాత ఆలోచించుకోవచ్చునని కథాకాలంగురించి మొదట నిర్ణయించుకుందా మనుకున్నాను. కథ చదివితే నాలిక మండేటంత ఘాటైన కాలం ఏది? నేటి కాలం మాత్రం కాదు. ఇది కథలకి కాలమే కాదు. రుచీ

పచీ లేనివి తప్ప కమ్మగా కారంగా ఉండే కథలు ఈ కాలంలో కనబడవు. అంతేకాదు. పూర్వకాలం సత్యకాలం కాబట్టి అప్పుడు మనుష్యులతో జంతువులు మాట్లాడేవి. దేవతలు ప్రత్యక్ష మయేవారు. కథకి కాళ్ళూ చేతులూ ఉండేవి కావు. ఇప్పుడు కథ నడిస్తేనేగాని ఎవరూ చదవరు. తలా తోకా లేని కథలు ఎవరికీ అక్కర లేదు.

అదొహాటిన్నీ, ఈ రోజుల్లో ఎవరి కథలు వాళ్ళే రాసుకుంటున్నారు. వాళ్ళకి మనం వండిపెట్టే కథలు సాయించవు. నీ కథ ఎవడికి కావాలి ? మా ఇంటికి రా ? అటకమీద ఆవకాయ గూనల్లో అనేకమైన కథ లున్నాయంటారు. బాగా ఊరిన కథలు. అన్నట్టు. పత్రికల్లో పడే వార్తల్ని కూడా కథలే అంటున్నా రిప్పుడు. "ఇందులోఏమీ స్టోరీ లే", దంటాడు సంపాదకుడు. రిపోర్టరు తెచ్చిన వార్తనుచదివి. జరిగింది జరిగినట్టుగా రాశా నంటాడు రిపోర్టరు. అందుకే ఇంత అధ్వానంగా ఉందని సంపాదకుడు దాన్ని చి.కా.బు. లో పారేస్తాడు.

చి. కా. బు. అంటే జ్ఞాపకం వచ్చింది. చిత్తు కాగితాల బుట్టల్లో వెదికితే ఎన్నో కథలకి బీజాలు దొరుకుతాయి. చాలా కథల్ని సంపాదకుడు చంపేస్తూ ఉంటాడు. దానికి చాలా కరణా లుండొచ్చును. రాజకీయ, నైతిక, సంసారిక, లౌకిక, పారలౌకిక కారణాలు, వీరేశలింగం పంతులూ, చిత్తుకాగితాల బుట్టా కథ మీరు వినే ఉంటారు.

"ఆ కథ చెప్పవూ ?" అంది నా ఆకలి. ఆకలి అడిగినప్పుడల్లా కథ చెప్పకూడదు. ఆకలి రుచి యెరుగదు నేను వండుతున్న కథ పాఠకుల ఆకలి తీర్చడానికి. ఇది సరైన పాకంలో పడుతుందో పడదో. కొందరు కథకులు చాలా అదృష్టవంతులు. వా ళ్ళేదిచ్చినా మింగేస్తారు పాఠకులు. గాలిపేని కథ అల్లెయ్యగలరు వాళ్ళు. ఆ విద్య అందరికీ పట్టు పడుతుందా ? అదృష్టవంతులనా అన్నాను ? సిద్ధహస్తులు వాళ్ళు. చేతి చలవ అంటామే. అదేదో ఆ చెప్పలేనిది వాళ్ళలో ఉంటుంది. అదో ప్రజ్ఞ. ,అంతే. దాని సరిహద్దులు వెదకడం ప్రయోజనంలేని పని. సరిహద్దులలో ఇముడక పోవడంలోనే ప్రజ్ఞ అనేది ఇమిడి ఉంటుంది.

ఎసరుమీద పెట్టిన ఇతివృత్తం మాట మరిచిపోయాను. ఈపాటి కప్పుడే అది ఇగిరిపోయి ఉంటుంది. కథానాయకుడు అసలే కనబడలేదు. కాలం ఒక్కటిమాత్రమే నిశ్చయమైంది. అదీ మిథ్యే అనేవాళ్ళు లేకపోలేదు. కాలం అనేదే కనపడకండా ఉండాలంటే, బోర్లా పడుకొని కుడికాలి బొటనవేలితో ఎడమ చెవినీ, ఎడంచెయ్యి ఉంగరంవేలితో కొండ నాలికనీ ముట్టుకునీ రెండు కళ్ళనీ ముక్కుకొనకి తెచ్చి చూడాలనుకుంటాను. ఈ వ్యాయామాన్ని నే నిప్పుడు సిఫారసు చెయ్యదలచుకోలేను. ఇలా చేసినా చెయ్యక పోయినా కాలం అనేది ఎప్పుడూ కనపడదు.

కథని ఒక కాలానికి బంధించడం నా కిష్టం లేదు. కాలమూ లేక, వస్తువూ లేక, కథా నాయకుడూ లేకపోతే కథని కంచికి పంపించడం ఎలాగ? అన్ని కథలూ కంచికే ఎందుకు వెళ్ళిపోతాయో నాకు తెలియదు. మా నాయనమ్మ బతికున్నంత కాలం ఈ సందేహం నాకు కలగలేదు. ఇప్పుడు బతికున్న నాయనమ్మ లెవరూ ఈ సందేహం తీర్చలేరు. అసలు, మా నాయనమ్మ కథ చెబుతూ ఉంటే ఆ కథ యెలా కంచికి వెళ్ళుతుందో అని తప్ప ఎందుకు వెళ్ళుతుందనే ప్రశ్న వచ్చేది కాదు. నా కొకొక్కప్పు డనిపిస్తూ ఉంటుంది, అన్ని కథలూ కంచికే వెళ్ళిపోతాయి కదా, కంచిలో ఎన్ని కథ లుండాలో అని. తెలుగు కథలకి మాత్రమే కంచి గమ్యస్థాన మనుకుంటాను. బంగాళీ కథలు ఎక్కడికి వెళతాయో? ఇతర భాషల్లోకి కాబోలు? లేకపోతే బంగాళాఖాతం ఉంది కాదూ? ఎన్ని కథలనైనా ఇముడ్చుకోగలదు.

నాయనమ్మలు ప్రారంభించే కథలు కంచిలో అంతమైతే, కంచిలో ప్రారంభమయ్యే కథలు నాయనమ్మల్లో అంతమవుతాయా? ఇదేమిటి మళ్ళీ ప్రారంభానికొచ్చాను? ఇంతకీ ఏదీ కథ! ఈసారి ఒక కథానాయకుణ్ణి చూసుకుని మరీ బయలుదేరాలి. ఎంత కలికాలమైనా ఎక్కడో ఒక నాయకుడు దొరక్కపోడు. ఆంధ్రదేశంలో నాయకుల కేం కొదవా? అయితే ఒక చిక్కుంది. వాళ్లు తమమీద పద్యాలు రాయమంటారు. పువ్వుల దండలు వెయ్యమంటారు. స్వాగత

పత్రాలు సమర్పించమంటారు. ప్రతిఫలంగా ఏవో పెర్మిట్లు సంపాదించి పెడతామంటారు. వీళ్ళిప్పుడు చాలా తెలుగు మీరిపోయారు. ఇదివరకైతే ఏదో కథకి నాయకుడుగా ఉండడానికి అంగీకరించేవారు. పత్రికల్లో తమ పేరుపడితే చాలు ననుకునేవారు. ఇదివరకు ఏం చేస్తున్నారు తమరంటే స్వరాజ్యం తేవడానికి ప్రయత్నిస్తున్నామనేవారు. ఇప్పుడుమాత్రం "ఇంగ్లీషువాడు మనకిచ్చిన స్వరాజ్యం ఏమీ బాగులేదు. దీన్ని పట్టికెళ్ళి వాడికే ఇచ్చేద్దాం" అంటున్నారు. ఈ నాయకుల్ని ఎంత చెయ్యి తిరిగినవాడైనా పచ్చడి చెయ్యలేడు. ఇలాంటి వాళ్ళతో కథ వండాలంటే అది మాటలతో పనికాదు. కోతలు వాళ్ళ ప్రత్యేకత కాబట్టి ఆ క్షేత్రంలో మనం అడుగు పెట్టడానికే వీల్లేదు.

అక్కడకీ ఉండబట్టక ఒక నాయకుణ్ణి ఈమధ్య ఆశ్రయించాను. ఏదో ఉద్యోగాని కొచ్చాననుకుని ప్రధాన మంత్రికి ఉత్తరం ఇస్తానన్నాడు. "ఏ ప్రధానమంత్రికైనా సరే. రాష్ట్ర, కేంద్ర, సామ్రాజ్య—" అంటూండగా, అది కాదు. నాది వేరేకథ, అన్నాను. నీ కథ వినడానికి నాకు తీరుబాటు లేదన్నాడు. కాదు మీ కథే అన్నాను. అతడు తికమకలో పడిపోయాడు. "వీడికిగాని వెర్రెత్తిందేమిటి చెప్మా?" అన్నట్టు నా వేపు చూశాడు. "స్తిమితంగా ఆలోచించుకుని నీ కేమిటి కావాలో నిర్ధారణ చేసుకో. వెంటనే చెప్పఖ్ఖర్లేదులే. నేనిప్పుడు ఢిల్లీకి వెళ్ళి వారం రోజుల్లో

వస్తాను. ఈలోపున ఒక నిర్ణయానికి రా!" అన్నాడు. వచ్చా సన్నాను. "నిన్నేమీ అడక్కూడదనే నిర్ణయానికి వచ్చా" నని చెప్పి అక్కణ్ణుంచి కదిలిపోయాను.

నా కథ కదలకండా ఉంది. నాయకుడు లేందే ఎలా కదులుతుంది? బజారులో దొరికే సరకు కాదుకదా నాయకు డంటే! అయినా ఒక నాయకుడి ఖరీదెంత ఉంటుందో? ఎవరో పెద్దపెద్ద పెట్టుబడిదారులు తప్ప సామాన్యులెవరూ నాయకులను కొనలేరనుకుంటాను. నాయకులుకూడా మన లాంటివాళ్ళకి తమ నిజమైన విలువ చెప్పరు. తమ అమూల్యత్వాన్నే అడుగడుగునా మనకి జ్ఞాపకం చేస్తారు.

నాయకాన్వేషణం తాత్కాలికంగా నిలుపుదలచేసి కథావస్తువు కోసం వెదకడం ప్రారంభించాను. వస్తువు గుణం వాస్తవికత్వం. ఇది అంతటా ఉన్నదే! నా కథకి సరిపోయే టంత సరుకుమాత్రం తీసుకుందా మనుకున్నాను. కొంత మంది ఒక చిటికెడు కథావస్తువు తీసుకుని గంగాళాలకొద్దీ కషాయాన్ని కలుపుతారు. మరికొంతమంది చవగ్గా దొరికిందికదా అని గంగాళమంత కథావస్తువు తీసుకుని చెమ్చాలో ఇమిడి పోయేటంత చిన్న కథ రాస్తారు. తేనె కలుపుకుని ఔషధప్రాయంగా దాన్ని దిగమింగాలి. కథ అయిపోతుంది. కథావస్తువు మిగిలిపోతుంది. సమపాళంగా కథావస్తువు ఉండా లంటే కథ తాలూకు కొలతలు తీసుకుని దానికి సరిపోయి నంత వస్తువు కూరడం ఒక పద్ధతి. దొరికిన కథావస్తువుకే

కొలతలు కట్టి కథ కట్టడం ఇంకో పద్ధతి అయితే, తయారయిన కథలో ఇంతవస్తుందని ఎవరూ తూనిక వేసి చెప్పలేరు.

ఎలాగయితేనేం కథావస్తువు దొరికింది. సర్వత్రా ఉన్నదే కాబట్టి శ్రమపడి వెతకడం తప్పింది. పాఠ్లు కుదరక బాధ పడుతున్నానంతే! కథానాయకుడితో ఒక రకం బాధయితే కథావస్తువుతో ఇంకొకరకం బాధ. చిత్రమేమిటంటే మా నాయనమ్మని ఈ చిక్కులేవీ బాధించేవి కావు. అయినా ఆ రోజులు వేరు. ఆ మనుష్యులు వేరు.

---



# నేటి హిరణ్యాక్షుడు



ఇరవై యేళ్ళకిందట నమశ్శివాయ ఈ ఊరొచ్చినప్పుడు తనతో ఏ చిరునవ్వును తీసుకొచ్చాడో అది ఇప్పటికీ అతనిముఖారవిందాన్ని అలంకరిస్తూనే ఉంది.

కొంతమంది చిరునవ్వును అంటించుకుని తిరుగుతారు. వాళ్ళమొగంచూసీ చూడగానే అది తెచ్చిపెట్టుకున్ననవ్వని తెలిసిపోతుంది. కొంతమంది అవసరం పడినప్పుడు దరహాసాన్ని ధరిస్తారు. అదీ కృత్రిమమే అని మనం ఆయాసం లేకండా గ్రహించేస్తాము. నమశ్శివాయ చిరునవ్వు మాత్రం కర్ణుడి కవచకుండలాల లాగ అతనిలో సహజంగానే పుట్టుకొచ్చింది.

అంతచక్కని చిరునవ్వుకి హక్కుదారుడైన నమశ్శివాయను హిరణ్యాక్షుడనీ, బకాసురుడనీ అంటే ఎవరూ ఒప్పుకోరేమో? పైకి కనబడని రాక్షసత్వం అతనిది. ఈ నాటి రాక్షసులు ఎంతో అందముగా కనబడతారు. నేను కూడా మొదటిసారి నమశ్శివాయని కలుసుకున్నప్పుడు ఇలాగే పొరబడ్డాను. గాలం విసిరినట్లు నామీద తన చిరునవ్వును ప్రయోగించాడు.

నమశ్శివాయ ఈకాలపు బీల్జిబబ్ అనీ తెలుసుకోవడానికి నాకెంతో సేపు పట్టలేదు.

నమశ్శివాయ దొంగ. పచ్చిదొంగ. గజకర్ణ గోకర్ణ విద్యలన్నీ తెలిసినవాడు. వాటికి కావలిసిన మెరుగులన్నీ ఇచ్చి తనదొంగతనాన్ని ఒక లలితకళగా అభివృద్ధిచేశాడు.

కాని ఈదొంగకి శిక్షలేదు. అసలునమశ్శివాయ చేస్తున్నది దొంగతనం అని గుర్తించడమేకష్టం. దొంగతనం చెయ్యవలిసిన అవసరం ఏముందతనికి? బోలెడంత ఆస్తి ఉన్నవాడు. ఇరవైయేళ్ళుగా వ్యాపారంచేసి ఆ ఆస్తిని మరింత అధికం చేశాడు. పదిమందిని తనకింద ఎప్పుడూ పోషిస్తున్నవాడు. ఒక్కడూ పట్టుమని ఒకఏడాదిపాటయినా తన దగ్గిర పనిచెయ్యక పోతేనేంగాక! ఎవ్వరినీ తననోటితో తాను పొమ్మనలేదు. వాళ్ళంతట వాళ్ళుగా పోతే ఉండమని ప్రాధేయపడనూ లేదు.

నమశ్శివాయ ఎంత పెద్దమనిషితరహాగా కనబడతాడు! ఊళ్ళో అతనికెంత పలుకుబడిఉంది! అతనాదొంగ? నమశ్శివాయ దొంగతనం చేస్తాడంటే అలా అన్నవాడినే అంతా తిడతారు.

నన్ను తిడితే తిట్టండికాని నమశ్శివాయ దొంగఅనడం మానలేను. అయితే పోలీసుల నోటీసులోకి వచ్చే దొంగతనం కాదతనిది. కోర్టులో ఫిర్యాదుచేస్తే ఋజువులేదుపొమ్మంటారు. చోరీ సరుకు నమశ్శివాయ తనదగ్గిర అట్టెపెట్టుకోగలిగినదికాదు. ఇంకొకళ్ళ దగ్గర దాచిపెట్టగలిగినదీ కాదు.

నమశ్శివాయ ఇతరుల మనశ్శాంతిని అపహరిస్తూ ఉంటాడు.

చెప్పేనుకాదూ ఈదొంగతనానికి హైకోర్టుకివెళ్ళినా శిక్షలేదు. పదిపదిహేనేళ్ళనుంచీ నమశ్శివాయని బాగా ఎరుగుదును నేను. ఎవరి మనశ్శాంతినైనా ఇట్టే చిత్రంగా లాగెయ్యగలడతను. ఇతరుల మనశ్శాంతిని తస్కరించి ఏం చేసుకుంటాడతను? ఈ ప్రశ్నకి జవాబు చెప్పగలగడం కష్టమే. నిజానికిది తనకెందుకూ ఉపయోగపడదు. ఇంకొకడికి మనశ్శాంతి లేకండా చెయ్యడంవల్ల నమశ్శివాయకి లభించేలాభం రూపాయిణా పైసల్లో లెక్కించదగ్గది కాదు. ఎదటివాడి మనశ్శాంతిని తొలంగించ గలగడమే ఒక ప్రజ్ఞ. దాన్ని కోల్పోయినవాడు చిత్రహింసపడుతూఉంటే నమశ్శి

వాయకి అమేయమైన ఒకానొక ఆధ్యాత్మికానందం కలుగు తుంది.

తూరీగని పట్టుకొని ఒకకాలులాగీ, ఒకరెక్క విరిచీ చిన్నపిల్లడు చెప్పరానిసంతోషం పొందుతాడు. ఇది కేవలం చిన్నతనపు సరదా. నమశ్శివాయ దీనిని అత్యున్నత శిఖ రాలకి తీసుకుపోయాడు. మానసిక వీథుల్లో సాగించే దండ యాత్ర అతనిది. ఎంతగుండె నిబ్బరం కలవారైనా నమశ్శి వాయధాటికి తట్టుకోలేరు. విధేయంగా తమ మనశ్శాంతి నతనికి సమర్పించుకుని తిరోగమించ వలిసిందే.

యక్సరేవేసి వైద్యుడు దుష్టాంగాన్ని పోల్చుకుం టాడు. క్లోరోఫారంఇచ్చి నొప్పిలేకండా శస్త్రవైద్యంచేస్తాడు. నమశ్శివాయది యక్సరేచూపు. ఎదటివాడి మన స్తత్వాన్ని ఇట్లే చదివేస్తుందాచూపు. వాడిమీాద క్లోరోఫారంలాగ పనిచేస్తుంది నమశ్శివాయ చిరునవ్వు మనశ్శాంతిని లాక్కుం టున్నప్పడు రోగికి ఏమాత్రమూ నొప్పి అనిపించదు. తర్వాత యావజ్జీవితం తహతహలాడిపోతాడు పాపం ఆ అనాథప్రాణి.

అది గర్వం అనుకోండి, మరేదైనా అనుకోండిగాని నేనొక్కణ్నే నమశ్శివాయతో నెగ్గుకొస్తున్నాను. ఎన్నో సార్లు నమశ్శివాయ నామీాద రకరకాల అస్త్రాలు ప్రయో గించి చూశాడు. కోల్పోవడానికి నాకసలు మనశ్శాంతి అనేదే లేదు. ఆ సంగతి నమశ్శివాయకి తెలియక పోవడమే నాకెసురుఘాసు.

ఎన్నోసార్లు నన్నతడు తన చక్రబంధంలోనికి ఈడవాలని చూశాడు. నే నంగీకరించినట్లే కనబడేవాణ్ని. నన్ను చాలా ఆప్యాయంగా పలకరించి ఏవేవో ప్రతిపాదనలు చేస్తాడు. అన్నిటికీ నేను ఔనని తలూపుతాను. ఆ ప్రతిపాదనలు అమలు చెయ్యడమనేది ఉండదని మాఇద్దరికీ తెలుసును. కాని చర్చించే టప్పుడుమాత్రం ఒక్క చిన్న విషయాన్ని కూడా మరిచిపోకండా ప్రణాళికలు వేస్తూఉ టాం.

"రేపు మెయిల్లో మనం బొంబాయి వెళ్ళుతున్నాం. మీరు సరాసరిగా స్టేషనుకి వచ్చెయ్యండి. సీట్లు రిజర్వు చేయించేస్తున్నాను" అంటాడు నమశ్శివాయ.

హోల్డాలయినా తీసుకెళ్ళకండా మర్నాడు మనిషిని మాత్రం స్టేషనులో హాజరవుతాను. రిజర్వేషను ఉండదు. నమశ్శివాయ రాడనినాకు తెలుసును. నేనతనికోసం కాసుకుని కాసుకుని నిరాశచేసుకుని బెంగగా ఇంటికిపోతానని నమశ్శివాయ వుద్దేశం. అతను రాడని ఋజువు చేసుకోవడానికే నేను స్టేషనుకివెళ్ళి, బొంబాయిమెయిలు కదిలేదాకా వుండి తిరిగిపోతాను.

మర్నాడో, వారం రోజుల తర్వాతనో మళ్లీ మేం ఇద్దరం కలుసుకున్నప్పుడు ఒక్కరమూ ఈ సంగతి ఎత్తము. నమశ్శివాయ మరేదో కొత్త ప్రతిపాదన చేస్తాడు. నేను సావకాశంగా వింటాను. నాకు తోచిన సలహాలేవో ఇస్తాను. "రాజేశ్వరరావుకి ఈ వుద్యోగం ఇస్తే ఏలావుంటుందని మీ

వుద్దేశం?" అని అడుగుతాడు నమశ్శివాయ. ఓహో, రాజే శ్వరరావు మనశ్శాంతిని దొంగిలించాలని ప్రయత్నమన్న మాట అని నేను మనస్సులో అనుకుని కొంచెంసేపు ఏమీ మాట్లాడను.

"ఏం మాట్లాడవు?"

"అదే ఆలోచిస్తున్నాను. రాజేశ్వర్రావు కన్నా ఇంకా పనికొచ్చే వాళ్ళెవరైనా వున్నారేమో అని చూస్తున్నాను."

"లేదు రాజేశ్వర్రావే రైటయినమనిషి."

కొన్నాళ్ళపాటు రాజేశ్వరరావు నమశ్శివాయ దగ్గిర కొలువులో కుదురుకుంటాడు. కొన్ని సంవత్సరాలకి సరిపడ్డ అనుభవాలతో నిష్క్రమిస్తాడు. నేను చెప్పలేదూ, రాజే శ్వరరావుని పొమ్మని నమశ్శివాయ తన నోటితో తాను ఒక నాటికీ అనడు. ఇక్కడనుండి పోతే చాలునని రాజేశ్వర రావే అనుకొనక తప్పని పరిస్థితులు కల్పిస్తాడు.

నమశ్శివాయ ఎవరి మనశ్శాంతినీ అకస్మాత్తుగా తస్కరించడు. ఆకాశంలో మేఘం క్రమక్రమంగా మాయ మైనట్లు అతని సమక్షంలో నీ మనశ్శాంతి హారతి కర్పూరమై పోతుంది. ఇందుకతడు వుపయోగించే టెక్నిక్ ఇప్పటికీ నాకర్థం కాలేదు. కాని అదేదో గొప్ప టెక్నిక్ అనిమాత్రం ఎరుగుదును. ద్వారం వెంకటస్వామినాయుడుగారు శంకరా భరణం తానంవాయించడంలో ఒకప్రత్యేక ప్రక్రియ చూపిస్తా రని ఎవరెరగరు? కాని అదేదో మనకికూడా తెలిస్తే మనం

కూడా అలాగ వాయించగలం కాదూ? కాని మనకది తెలియదు. అంతే. ఇంచుమించు నమశ్శివాయ టెక్నిక్ కూడా ఇంతే. నాయుడుగారిలో దేవత్వముంటే నమశ్శివాయలో రాక్షసత్వం వుంది. అంతే భేదం!

ఈ రాక్షసత్వంలోకూడ ఏదో ఆకర్షణ వుందని ఒప్పుకోక తప్పదు. నమశ్శివాయకి నేను సదానందం అని ఒక ముద్దుపేరు పెట్టాను. అతనికొక శాశ్వతమైన చిరునవ్వు వుందన్నాను కాదూ? అది నిద్రిలోకూడా అతని ముఖం మీద నాట్యమాడుతూ వుంటుంది. అతని విజయానికదిధ్వజం. తన ఆవరణలోకి వచ్చిన అందరి మనశ్శాంతినీ అతడపహరిస్తాడు. అందుకతని చిరునవ్వేసాక్షి.

అతని మోటారు డ్రైవరు పనిమానుకున్న రోజున బాకీ జీతం కోసం పదిగంటలికి నమశ్శివాయ దర్శనం చేసుకున్నాడు. వుండు ఇస్తానన్నాడు నమశ్శివాయ. ఇవ్వనని ఎప్పుడూ అనడు. గుమ్మంలోనే కూర్చున్నాడు డ్రైవరు. మధ్యాహ్నం పండ్రెండు గంటలయింది. నమశ్శివాయ రెండోసారి బైటకివచ్చి రిస్టువాచీచూసుకుంటూ "అరగంటలో వచ్చేస్తాను. ఇక్కడేవుండు" అని కారునడుపుకుంటూ వెళ్ళిపోయాడు. డ్రైవరు భోజనం చెయ్యలేదని నమశ్శివాయకి తెలుసు. "ఈరూపాయి తీసుకుని ఎక్కడైనా భోజనం చేసిరా" అని నమశ్శివాయ బుద్ధిపూర్వకంగానే అనలేదు.

అరగంటలో వచ్చేస్తానన్న నమశ్శివాయ ఆరోజంతా ఇంటికిరాలేదు. విసిగివేసారి వుసూరుమంటూ వెళ్ళిపోయాడు డ్రైవరు. మర్నాడు నమశ్శివాయ తోటమాలినడిగి కనుక్కున్నాడు. "డ్రైవరు ఎంతసేపు కాచుకు కూచున్నా"డని. అంతసేపు బాధపెట్టగలిగానని ఆనందం నమశ్శివాయకి.

ఎవరి అంతస్తుకి తగిన ఫాయాలో నిలబడి వాళ్ళని చిత్తు చెయ్యగలడు నమశ్శివాయ. అతనితో సంభాషణ ఒక అనుభవం. అలాగమాట్లాడుతూనే వుంటాడు. నీ చెవులు రెండూ ఆతని జేబులోకి పోతాయి. ఆ సంగతి నీకు తెలియనే తెలియదు. తర్వాత ఇంటికివచ్చి తడిమి చూసుకుంటే చెవులుండవు. ఇంద్రజాలం అనుకుంటారు కాదూ? ఈసారి నమశ్శివాయతో మాట్లాడి చూడండి.

---




శ్రీ శ్రీ అన్నాడు నారాయణ బాబు.

ఆఁ, అన్నాను నేను. లేక ఊఁ అన్నానో. ఏదో అన్నాను, వింటున్నాను అనే అర్థం ఉద్దేశించి.

వింటున్నావా ? అన్నాడు నారాయణ బాబు:

నా మూలుగు అర్థం కాలేదన్నమాట. బోధపడేటట్లు మూలగ లేకపోయా నేమో ? కాని, చిత్రం! మళ్ళీ అదే మూలుగుతో జవాబిచ్చాను. వింటున్నాననే అర్థం వచ్చింది. రెండో మాట్లో ఉంటుంది కాబోలు మజా.

నీమీద ఊళ్ళో పుకారుగా ఉందన్నాడు.

ఏ ఊళ్ళో ?

ప్రస్తుతం ఈ ఊళ్ళోనే, వింటున్నావా ?

వింటున్నాను, అన్నాను. ఈసారి స్పష్టంగా. ఆఁ అనో, ఊఁ అనో అనకండా.

నువ్వు చెబుతున్నది వింటున్నానని నా ఉద్దేశం. నా మీద పుకార్లు అప్పుడే నా చెవిలో పడ్డాయని అర్థం చేసుకున్నాడు నారాయణ బాబు.

ఒక అరనిమిషం నిశ్శబ్దం.

తాను చెప్పదలచుకున్న సంగతి అప్పుడే నాకు తెలిసిపోయిందని ఆశాభంగం కలిగింది నారాయణబాబుకి. నా మీద చాలా ఘోరమైన నిందలు వ్యాపించాయి కాబోలు. చెప్పడానికి సందేహిస్తున్నా డనుకున్నాను నేను.

వినలేదు, అన్నాను నేను.

అయితే మరి వింటున్నానని ఎందుకన్నావు ?

చచ్చాను (బతికే వున్నాను లెండి) నా కేమనాలో తోచలేదు. నా మౌనం అర్థమయింది నారాయణబాబుకి.

నా గురించి ఎవరు ఏమనుకున్నా నాకు లక్ష్యం లేదు. ఏమీ అనుకోకపోతేనే బాధపడతాను. నేను నరమాంసం భక్షిస్తానన్నా రహస్యంగా రక్తం తాగుతానన్నా సరే. అలాకూండా అనుకోవచ్చు ననేస్తాను అంతే ?

అయినా కాస్త ప్రజ లేమనుకుంటున్నారో కనుక్కోపడం మంచిదని, ఏమనుకుంటున్నా రేమిటన్నాను

నువ్వు మెటీరియలిస్టువనీ, అథీయిస్టువనీ, అనార్కిస్టువనీ అంటున్నారు.

నాకు కోపం వచ్చింది. అవి నేనంటున్న మాటలే. వాళ్ళనడ మేమిటి?

నాకేమీ కోపం లేదన్నాను. నవ్వుతూ ఉంటే కళ్ళంట నీళ్ళొచ్చాయి. నవ్వెందుకంటే ఇవేవీ కాకండా ఔనని అంటున్నా నేమో అని. నిజానికిది దుఃఖించదగ్గ విషయం.

దేవుడు నేనే కాదా? లేక నాకు దేవుడులేడా? పురాణాలు వదలుకోవాలా? అరాజకత్వం అంటే అల్లకల్లోలమా? ఆదిభౌతికంగా తర్కించకూడదా? అయితే ఇన్నీ ఆదిభౌతికంగానే ఆలోచిస్తున్నామా?

ఇటువంటి ఆలోచనల మధ్య హఠాత్తుగా స్ఫురించింది కథ.

వింటున్నావా?

ఈమాట నేనన్నాను. ఆఁ అనో ఊఁ అనో జవాబుగా మూలిగాడు నారాయణ బాబు.

శూర్పణఖా మానసంరక్షణం, అన్నాను.

అంటే.

అంతే, పౌరాణిక కథ.

సాంఘిక కథలంటే విసుగొచ్చిందా? లేక ప్రజామో దాని కనుగుణ్యంగా అభిప్రాయాలు మార్చుకుంటున్నావా అన్నాడు.

సంఘం అనకు. ప్రజలంటే ఒప్పుకుంటాను. ప్రజలనగా గవర్నరునుంచి గవరయ్యదాకా అందరూ ప్రజలే కాని

గవర్నరు సంఘం వేరు. గవరయ్య సంఘం వేరు సాంఘిక రచనలు ప్రజామోదం పొందక పోవడానికి కారణం ఇదేం అలాగే సాంఘిక చిత్రాలు కూడా మనకు పొడుగాటి పౌరాణిక చిత్రాలే కావాలి. అందుకు తగ్గ కథలే మనం రాసుకోవాలి. పేరుకూడా పొడుగ్గా ఉంచాను గమనించావా.

పురాణ కథనైతే ఇక నువ్వు వ్రాసే దేముంది ?

స్వకపోల కల్పితమైన పురాణ కథ. ఇది మొదటి అసందర్భం. అసందర్భాలు మెదడుకి మెరుగు పెడతాయి. పెంచడానికీ, తుంచడానికీ అపరిమితమైన అవకాశం వుంటుంది. అనవసరమైనది లేనట్టే అసాధ్యమైనది కూడా ఉండదు. శూర్పణఖా మానసంరక్షణ మేమిటి నీ మొగం ? ఏం? ఎంచేతా? శూర్పణఖ రాక్షసి అయితేనేం ? అది నర మాంసం భక్షిస్తేనేం? తాటికల్లు మొదలు మనుష్య రక్తం దాకా దొరికినవన్నీ తాగేస్తేనేం ? శూర్పణఖకి మాత్రం మానం లేదా ? దాన్ని సంరక్షించడం ఉత్తమాదర్శం కాదా?

శూర్పణఖ తనకి మానభంగం చెయ్యవలిసిందనే రాముల వారి నడిగింది.

అలా చెయ్యకపోవడమే మానసంరక్షణం. కాక అదే మానభంగమా ? గట్టి చిక్కు తెచ్చిపెట్టావు. కేవలం హేతువాదంతో చర్చించి తేల్చుకోవలసిన సమస్య కాదు. లక్ష్మణుడు కూడా నిరాకరించాడు. అప్పటికి వానరసైన్యం ఇంకా మిత్రమండలిలో చేరలేదు.

చేరినట్టు కల్పించకూడదా ?

అసందర్భాలకు కూడా ఒక సందర్భం వుంది. నమ్మ డానికి వీలులేని అపనమ్మకాల నెవ్వరూ నమ్మరు. పీపిల్సు పార్కును దండకారణ్యమని అనుకోవచ్చు గాని హనుమం తాన్ని శ్రీరాము డనుకోవడం కష్టం.

కష్టమే కాని అసాధ్యం కాదు. నీ కథలో కూడా అసాధ్యాలుంటాయా ?

ఉండకూడదు. ఉండడానికి వీలులేదు. శూర్పణఖకి ఖరదూషణాదులవల్ల మానసంరక్షణం జరిగిందని రుజువు చేస్తున్నాను. కామరూపిణి అయిన శూర్పణఖ ఇంటర్వెల్ దాకా అందంగా కనబడుతుంది. తరవాత వికారంగా మారి పోతుంది. మధ్య మధ్యకూడా మారవచ్చును. కథానాయిక పాత్ర ధరిస్తున్న నటి జబ్బుపడ్డా, దగా చేసినా, పిచ్చెత్తి పోయినా ప్రొడ్యూసర్లు భయపడ నక్కరలేదు. కాస్టింగ్ డైరక్టర్లు నిద్రాహారాలు మాని పాత్రకు సరియైన వ్యక్తి కోసం దేశమంతా గాలించ నక్కరలేదు.

నారాయణ బాబు అరదస్తా కాగితాలూ, కలం నా ముందు పడవేసి, నోటిని చెప్పడం కాదు, సంభాషణలతో సహా కథ తయారు చేసెయ్యమన్నాడు. పాటలు తర్వాత అతుక్కోవచ్చు నన్నాడు. సాయంత్రం సరికి కథ రాసి వాడి దగ్గరే ఉంచేశాను.

నాలుగు రోజులు పోయాక నారాయణబాబు ఉప్పొంగిన తోలు సంచితో తంబుచెట్టి వీధి, చైనా బజారువీధిలో కలిసిపోయే చోట కనిపించాడు.

కష్టేకింతవ ? అన్నాను, అనుమానిస్తూనే.

ప్రచురణ కిచ్చేద్దామని తెచ్చే నన్నాడు.

నయం, నేను సమయానికే వచ్చా నన్నమాట. దీన్ని ఎంతమాత్రమూ బయట పెట్టడానికి వీలులేదు సుమా. వెండి తెరమీద నే ఇది కనబడాలి.

ప్రకటిస్తే మాత్రం ? అన్నాడు.

ఇంకా పెరటిదారినే ఉన్నావు. పురాణ కథలను కాపీరైటు లేదు. కథ వ్రాయడానికి మనకెంత హక్కుందో దాన్ని ధారాళంగా స్వీకరించి ఫిలిం తియ్యడానికి అవతల వాళ్లకి కూడా అంతే హక్కు. స్టూడియో ఆవరణలోనికి కూడా మనల్ని రానియ్యరు.

అయితే దాటేస్తా నన్నాడు.

ఇప్పటికీ ఆ కథ అజ్ఞాతవాసంలోనే ఉంది.

---




'ఆహా...ఏమి...నా...ఆ...ఆ...భాగ్యము...'

పాడుతూ స్నానాలగదిలో ప్రవేశించాడు. సంగీతం ప్రపంచభాష అయితే స్నానాలగది గానమందిరం. ప్రాక్పశ్చిమాల భేదంలేని ఆచారం స్నానాలగదిలో సంగీతం పాడడం! ఒంటిమీద నీళ్ళు పడతాయంటే గొంతుక తంత్రులు సవరిస్తుంది.

తలుపు వేసుకున్నాడు.

'అహా...ఏమి...నా...ఆ...'

సరీగ్గా సక్కుబాయిలాగే విరుపులు విసిరాడు. అంటే తుంగల చలపతిరావులాగ. దాసరి కోటిరత్నం ఎలా పాడుతుందో వినలేదు. చచ్చి ఏస్వర్గాన వున్నాడో చలపతిరావు..

అసలు చచ్చిపోయాడో లేదో. రామనాథశాస్త్రి అనుకుం టాను. లేదు, ఇద్దరూ.

'ఆ...భాగ్యము, స్వామి కనిపించెన్.'

గానంచా విప్పేశాడు.

'పండరినాథుని పాదమె దొరకెన్...పాపములన్నియు నేడే తొలగెన్...'

చలివేస్తోంది నీళ్ళు ఒంటిమీద పడనంతసేపే. ధైర్యంచేసి చెంబెడు నీళ్ళు పోసుకున్నాడు. ఆవరసని నాలు గైదు చెంబులు గబగబా దిమ్మరించుకున్నాడు. బిందెడు వేణ్ణీళ్ళు తగ లెయ్యకూడదూ పెళ్ళాంముండ! కర్ర లయి పోతాయట. ఏం చేస్తోందో వంటింట్లోంచి ఊడి పడదు.

* * *

వంటింట్లో సన్నగా, ఆడగా, వంటపొగలలో కలిసి మెలసి కంఠం.

'తొలినే జేసిన పూజాఫలము.'

చదువుకుంటానంటే, సంగీతం నేర్చుకుంటానంటే, బలవంతంమీద ముడివేయించారు. వద్దంటే వినక నన్ను నరకంలో తోసేరు. ఎన్నాళ్ళయినా ఇంతే. నాకిది జన్మశిక్ష. నేర్చుకున్న వీణ మరచిపోతున్నాను. నేర్చుకొని వంట నా నెత్తిమీద పడింది.

* * *

—ఏమేవ్, సబ్బు కనబడదేం?

—పడమటి గూట్లో వుంటుంది.

తలుపు తీశాడు. తోశాడు. తడుసుకుంటూ వెళ్ళాడు. ఆలాగే. సబ్బు తెమ్మనుకున్నాడు. గదిలోకి వెళ్ళాడు. మళ్ళీ తలుపు వేశాడు. మరో నాలుగు చెంబుల నీళ్ళు పోసుకున్నాడు. ఈలతో పాడుతున్నాడు భాగ్యంపాట.

'పాపా...పీపీ...పా...పాపప...'

ఏమిటో వెధవబదుకు. స్నానం, భోజనం చెయ్యాలి. తాంబూలం, బట్టలూ, జోళ్ళూ వెయ్యాలి. వెళ్ళాలి ఆఫీసుకి. టైమయిపోతోంది. వంటయిందో లేదో, రోజూ ఇదేఏడుపు. వారానికి రెండు ఆదివారాలూ. నెలకి డజను ఫస్టు తారీఖులూ ఉండకూడదూ? దొరల దేశాల్లో ప్రతివారం జీతాలిస్తారు. కాని ఏం లాభం? తాగేస్తారు. దొరలకి చలి వెయ్యదూ? స్నానం చెయ్యరు. ఉన్నిదుస్తులు వేసుకుంటారు. మాసిపోయిన గడ్డంచేసుకుంటే పూలుకోటు విప్పినట్టుంటుంది.

నోట్లో నీళ్లుపోసుకుని పుక్కిలించాడు. ముక్కులోని కెళ్ళాయి. ఉక్కిలి బిక్కిలైపోయాడు. సుజలాం, సుఫలాం, మలయజశీతలంగానే వున్నాయి.

* * *

వంటింట్లో 'వందేమాతరం' పాట.

ఎందుకో ఈ వైెళ్ళకి నళ్ళుపం? ఎవరి స్వాతంత్ర్యం కోసం? ఆడదానికి అడుగుతీసి అడుగు వేసే అధికారంలేదు కదా. నేనసలు పెళ్ళిచేసుకోననే అన్నాను. స్వతంత్రంగా బదుకుదామనుకున్నాను. నాలుగేళ్ళలోనే నా బదుకెంత

నాశనమయిపోయిందో. రెండుమార్లు ఆసుపత్రిలో పడ్డాను. ఈ మాటయినా నిలుస్తుందో నిలవదో. వీడి కేవో జబ్బులున్నాయి. ఏవో దురలవాట్లున్నాయి. ప్రతిరాత్రీ ఆలస్యంగా ఇంటికి రావడమే. ఎలా తప్పుతుంది నాకీ ఖైదు?

'...సస్యశ్యామలాం, మాతరం...వందే మాతరం·

*　　　　*　　　　*

వందేమాతరం పాటని ఫిలింలలో పాడ నివ్వరట. స్నానాలగదుల్లో పాడుకో నిస్తారనుకుంటాను. ఇరవై ఏళ్ళ కిందటి నాన్‌కో ఆపరేషను పాటలు జ్ఞాపకం తెచ్చుకుంటున్నాడు.

నిరాకరణ మను మిఠాయి ఇదిగో...

'కన్వర్ట్ కన్వర్ట్ హాల్లో కల్లు కష్టమర్సు ఇంటూ నాన్కోఆపరేష నను నవీన మతమునా...'

ఆ రోజుల్లో అవే బాగున్నాయి. అప్పుడు వాటి అర్థం తెలిసేది కాదు. స్కూళ్ళు ఎగ్గొడితే హెడ్మాస్టరు బెత్తం దెబ్బలు వడ్డించాడు.

'మరో ప్రపంచం, మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది...'

ఈ పాటమీద నిషేధం ఉందా? ఎవరు చెప్మా దీన్ని రాశారు? ఎవడో కమ్యూనిస్టు కాబోలు. ఇదో వెర్రి పట్టుకుంది వీళ్ళకి. సమానత్వంట! ఎలా వస్తుంది సమానత్వం?

ప్రకృతిలోనే లేదు సమానత్వం కాబట్టి కమ్యూనిజం తప్పు-మరో ప్రపంచంట? ఏమిటో అది?

వీపుకి సబ్బు పట్టించి తోముతున్నాడు. కపిలవాయి గాత్రం. రంగూన్‌లో పాడితే సిలోన్‌లో వినిపించేది, రేడియో లేని రోజుల్లో. వీపు అందుకు రాకండా ఉంది. రెండో చేతిత్తో రాశాడు.

'మీర జాలగలడా సత్యాపతి
వీపు గోకగలడా...'

**Parody** కి నవ్వొచ్చింది. అన్నీ ఇదివరకటివే. కొత్త కవిత్వం, కొత్తప్రపంచం, కొత్తసంవత్సరం అంటారు. అంతా భ్రమ. ఇదివరకు లేని విప్పాడేమున్నాయి? ఆ సూర్యుడే. ఆ చంద్రుడే. ఇదివరకు లాగే పెళ్ళాడుతున్నాం. పిల్లల్ని కంటున్నాం. పెంచుతున్నాం. పెరుగుతున్నాం. చస్తున్నాం. పుడుతున్నాం. మళ్లీ చస్తున్నాం.

చస్తున్నాను, ఈ చలితో –
– ఒసే వంటయిందా?

* * *

'శివ దీ...క్షా. .పరు రాలనురా...'

ఎక్కడెక్కడకో పోతాడు. ఏవేవో ఖర్చులు. నేను మాత్రం దమ్మిడీలతో సహా పద్దులు రాయాలి. నేనీసంసారం చెయ్యలేను. నాకు స్వాతంత్ర్యం కావాలి. సమానత్వం

కావాలి. వీళ్ళని నేను ప్రేమించలేను. ఏవన్నీ లేదా? ఏమో, ఏమో. శర్మని? ఏమో.

—మీరు నీళ్ళు పోసుకునేసరికి నావంట ఐపోతుంది.

*　　　*　　　*

అయినా పాపం ఒక్కత్తె. ఇంటి చాకిరీ అంతా చేసుకోవాలి. ఒక్కొక్కమారు చూస్తే జాలి వేస్తుంది. కడుపుతో వుందికూడాను.

కడుపు తోముకుంటున్నాడు. చిన్నప్పుడు మాఅమ్మ ఒళ్ళంతా తోమి కడుపుమాత్రం తోమేదికాదు. ప్రేమ ఉండదట. కడుపుప్రేమ. కడుపువల్ల పేమ, ప్రేమవల్ల కడుపు. To make love అంటాం. కడుపుచెయ్యడం అంటాం. ప్రేమ చెయ్యడం అనం. To make belly అనం. ఒక్కొక్కతీరు. ఇంగ్లీషువాడు ఎంత కొట్టుకున్నా తెలుగుని క్షుణ్ణంగా అర్థం చేసుకో గలడూ? గెలట్టీ డిక్షనరీలో తప్పులు చూపిస్తూ భారతికొక వ్యాసం రాస్తాను. అలాంటివి వేస్తారో, వెయ్యరో? అసలు నా మొగం నేను రాసేదేమిటి. ఆఫీసునించి వచ్చేసరికి నవనాళ్లూ తోడుకుపోతూాయి. వెధవఉద్యోగం మానేస్తే! బతకలేకపోతానూ? సంసారం ఒకటి కద! రెండు ఎందుకు కూడదూ? నేను మళ్ళీ పెళ్ళిచేసుకుంటాను. మరి ఇదో? చీరకి నిప్పంటుకుని ఇది చావకూడదూ?

విషాదవార్త: నేటిఉదయం ... పేటలో శ్రీమతి... (20 ఏళ్ళు) వంటచేయుచుండగా చీరకు నిప్పంటుకొనబడెను. ఆసుపత్రిలో చేర్చబడెను. అచ్చటనే ఆమె మరణించబడెను.

వెధవ ఊహలు. పాపిష్టిమనస్సు, మనలో ఇంత కుళ్ళు పెట్టుకుని లోకాన్ని తిడతాము.

కుళ్ళు వదిలినట్టేనా? కడుపుతో ముకోవడం అయింది. దిగేడు. నరగ; పీచువకుపులో బూరుగుదూది. దిగేడు. Attain - shun లకిష్టికే మూషిక్. శ్రోముకుంటున్నాడు. Glass with care.

ఏమిటో నానా చెత్తా రాసేస్తున్నారు. ఇది రాయొచ్చు, ఇది రాయకూడదు అనే వివక్షత పోయింది. ఏమేనా అంటే ఫ్రాయిడ్ అంటారు. లైఫ్రాయిడ్ అంటాను నేను. ఇమాజి నేషన్‌కి జబ్బుచేస్తేనే ఇలాంటి పేలాపనలు. నేను కన్సర్వే టివ్‌ని. ఉన్నదాన్ని నిలబెట్టుకోవాలంటాను. మార్పు నాకిష్టం లేదు. మర్యాదగా బతకాలంటాను. తప్పుపనులు చెయ్య కూడదు, నిజమే. కాని తప్పుపనులు చేసి బయలుపడిపోవడం మరీ తప్పు.

* * *

'ప్రేమమయ మీజీవితము, త్యాగమయమీ'

శర్మ నన్ను ప్రేమిస్తున్నాడు. నన్ను ప్రేమిస్తున్న వారిని నేను ప్రేమిస్తున్నాను. శర్మతో మాత్రం బదుకు ఇంత కంటె సుఖంగా వెలుగుతుందా? నాకు పెళ్ళి అక్కర్లేదు. ఏ ఉద్యోగం చేసినా బదికిపోగలను. తిరగబడాలనుకుంటాను. ధైర్యం చాలదు. ఈ లోకంలో ఆడదై పుట్టడమంత హీనం ఇంకోటి లేదు.

* * *

'ఆడబదుకే మధురం - ఆహా'

నిజం, ఆడదానికి ఇల్లే కోట. ఆడదాన్ని గుమ్మంకదల నివ్వకూడదు. ఎన్ని అగచాట్లుపడి అయినా ఆడదాన్ని మొగాడే రక్షిస్తాడు. మొగాడు చెడిపోయినా ఫరవాలేదు. ఆడది చెడిపోతే ప్రపంచమే ధ్వంసమయిపోతుంది. క్షేత్రం బీజం అన్నారు.

తోముకోవడం అయిపోయింది. మళ్ళీ నాలుగైదు చెంబులు దిమ్మరించుకున్నాడు.

—ఒసే వంటయిపోతే వడ్డించు.

—మీాస్నానం అయిందా?

—అయినట్టే.

— నావంటకూడా అయినట్టే.

పెడసరపు జవాబులు. స్కూలు ఫైనలుదాకా చదివానని దీని గర్వం. ఆడవాళ్ళకి చదువు అనవసరమేకాదు, హానికరం. అయిదోక్లాసుదాకా చదివేస్తేచాలు.

* * *

అప్పుడే వంటింటిలోంచి వినబడింది 'తుమ మేరా' అని. స్నానాల గదిలో సబ్బు నురగల్లోనూ, వంట యింట్లో తాలింపు వాసనలలోనూ కలిసి మగగొంతుకా ఆడగొంతుకా ఆలాపన సాగించాయి.

* * *

ఆఫీసుకి లైటయిపోతుంది. ఆడదానికి స్వాతంత్ర్యం ఇవ్వకూడదు.

శర్మని నేను ప్రేమిస్తున్నాను. పుట్టబోయె బిడ్డఅతని దే అనుకుంటాను.

'తుమ మేరా'

'తుమ మేరీ'

*　　　　*　　　　*

స్నానం ముగించాడు. మొగాడు అథార్టీ చేస్తూండం టే నే ఆడది అణగిమణగి ఉంటుంది. లేకపోతే ఈ ఆడవాళ్ళని పట్టపగ్గా లుంటాయా ?

ఆమె శర్మను గురించి ఆలోచిస్తోంది. అతడు తన హక్కును స్థాపించుకుంటూన్న గొంతుకతో అరిచాడు.

'—ఒసే! తువ్వాలు అందుకో!'

---



# హేమంతం

( చెలం "కొత్తచిగుళ్లు" చదివి )

పరధ్యానంగా పడుకున్నాను. ఆంధ్రజ్యోతి ఉగాది సంచిక నా గుండెలమీద నిద్రపోతోంది. నాకు మాత్రం సగం మెలకువ.

పరధ్యానంగా ఉంది. కళ్లు మూసుకునే ఉన్నాయి. ప. పా. గీసిన రతీమన్మథుల చిత్రం గుండెల్లో గుచ్చుకుంటోంది. ఒక చిలక విరిగిపోయిన గ్రామొఫోను ప్లేటులాగ చేసిన ప్రకటననే మళ్ళీ మళ్ళీ చేస్తోంది. నేటి సాహిత్య రాజకీయాలకీ, రాజకీయ సాహిత్యాలకీ, ఈ చిలుక చేస్తున్న పునః పునః ప్రకటనకీ ఏదో సంబంధం ఉందని మాత్రం గుర్తించేపాటిది నా మెలకువ.

పరధ్యానంగా కళ్లు మూసుకున్నాను. హఠాత్తుగా మా "భిక్షువర్షీయసి" ప్రత్యక్షమయింది.

పాఠకుల సౌకర్యంకోసం నా ఈదిగువ గేయ పాదాలు జ్ఞాపకం చెయ్యవలసి ఉంది.

దారిపక్క చెట్టుకింద
ఆరిన కుంపటి విధాన
కూర్చున్నది ముసిల్దొక తె
మూలుగుతూ ముసురుతూన్న
ఈగలతో వేగలేక.
ముగ్గుబుట్టవంటి తలా,
ముడుతలు తేరిన దేహం,
కాంతిలేని గాజు కళ్లు,
తనకన్నా శవం నయం !

"అవ్వా! విశాఖపట్టణం నుంచి ఎప్పుడు వచ్చావ్" అన్నాను.

ముసిల్ది మాట్లాడలేదు
పశిపోయెను జబ్బుచేసి,
అడుక్కునే శక్తి లేదు,
రానున్నది చలికాలం,
దిక్కులేని దీనురాలు !

మాట్లాడలేని ముసిల్ది ఏడుపులాంటి నవ్వు నవ్వింది. ఆంధ్రజ్యోతి ఉగాది సంచికను లాక్కొని భయంకరంగా అరుస్తూ ఒక్కొక్క కాగితాన్నే చింపడం మొదలుపెట్టింది.

"అది వంటబ్రాహ్మడి చొరగ చీమ. భానుమతి కోప్పడుతుం" దన్నాను.

అవ్వ ఆగ లేదు. శ్రీనివాస శిరోమణినీ, కుటుంబ రావునీ చింపేసింది.

"కొత్త చిగుళ్ళు" దగ్గరకి రాగానే అవ్వకోపానికి మాటలొచ్చాయి.

"చూశావా! చెలం వాలకం!" అంది అవ్వ.

"చలం కలం విశృంఖలం" అన్నాను నేను నా సహజ మృదు మధుర ధోరణిలో.

"ఖలం be damned," అంటూ అవ్వ చెలం కాగితాలు ఉగాది సంచిక లోంచి నేర్పుగా వేరుచేసింది. ముసిలిదాని బహు భాషా పరిచయం నా కాశ్చర్యం కలిగించింది. అయితే ఒక విధంగా నేను అవ్వకి మనుమణ్ణే కాని ఇంకో విధంగా అవ్వ నా కూతురు. కాబట్టి అవ్వ శైలికి కారణాలు నేనర్థం చేసుకోగలిగాను. ఇంతకీ చెలం కథలో కార్మిక కాంత చెడిపోయిన బాపనపిల్ల యాసలో మాట్లాడగా లేనిది మన ముసిల్ది ఇంగ్లీషు తెలుగు కలగలుపుతో మాట్లాడితే తప్పే మొచ్చింది ?

"చెలం టెక్నిక్ ను మే మందరమూ మెచ్చుకోవడం మాన లేకపోతున్నాం" అన్నాను.

అవ్వ చెలం కథను గుప్పిటినిండా పట్టుకుని క్షణకాలం గ్రాంథిక భాషలోకి ఘనీభవిస్తూ. "ధిక్కారమున్ సైతునే" అని దీర్ఘ నిశ్వాసం తీసింది.

"అవ్వా. నాకు నిద్దరోస్తోంది. చెలంమీద నీ ఫిర్యాదు నిడివిమీద ఆలోచిద్దాం. ఇప్పటిమట్టుకు నువ్వు ఏ మూరు మార్కెట్‌లోనో పడుకో. నీకు వసతి చూపించడానికి నాకే ఒక ఇల్లూ, వాకిలి లేవు. మాంసం కూరలు వండి పెట్టే వంట మనిషి అంతకన్నా నాస్తి, ఎలాగో ఇవాళమట్టుకి ఏ చెట్టునో ఆశ్రయించు. రేపు మనిద్దరం కలిసి విశాఖపట్టణం పోదాం" అన్నాను.

అవ్వ మళ్ళీ కొన్ని మణుగుల మానాన్ని నా మీద దిమ్మరించింది. "సరే, నీకంత కష్టమైతే పోతానులే" అన్న భావాన్ని ఆమె కళ్ళలో చదువుకున్నాను. ఇక లాభం లేదనుకొని అవ్వకు వేదామనుకున్న వాయిదా నా నిద్రకే వేసి అవ్వని ఎలా ఓదార్చితే బాగుంటుందా అనే ఆలోచనలో పడ్డాను.

"అవ్వా! మీ అక్కగారి సంగతి నాకు బాగా తెలియదు. నల్లమందు వేస్తుందని అసలే తెలియదు" అన్నాను– ఏదో అందామని.

"వేస్తే వేస్తుంది. నేటి పత్రికలన్నీ సరఫరా చేస్తున్న నల్లమందులో ఆవిడ వేసుకునేది ఎన్నోవంతు? మీ రాజకీయ నాయకులు చేసే ఉపన్యాసాలలో ఎంత నల్లమందు

లేదు? అసలు చెలం కథలోనే ఉందే మా అక్క యావ జీవితానికీ సరిపోయే నల్లమందు!" అంది అన్వా.

అన్వా చేతిలోంచి చలంకథ తీసుకుని అటూ ఇటూ తిరగేస్తూ అన్నాను. "అన్వా! చలం మీ అక్కనీ, మీ వర్గాన్నీ చాలా వేళాకోళంతో అవమానించిన మాట నిజం. అతని సౌందర్యపిపాసకి మీరంతా అపస్వరాలు".

"సెక్సు పిపాసకి మాత్రం కాదు పాపం. ఇంతకీ మేమూ, మా దారిద్ర్యమూ, మా వార్ధక్యమూ, మా అనారోగ్యమూ అపస్వరాలయితే వాటిని తొలగించడాని కెందుకు ప్రయత్నించకూడదు? చలం తన కథలోని దృక్పథంవల్ల ఈనాటి యెందరి అభిప్రాయలకి ప్రాతినిధ్యం వహిస్తున్నాడో నీకు తెలుసునా? నేటి సాంఘికరోగ నిదానానికి చెలంకథ చాలా పనికొస్తుంది."

"Oh! The image of the rose in my heart" అనుకుని, విమర్శ మరీ ప్రమాద ప్రదేశాలలోకి ప్రవహిస్తున్న కారణంవల్ల ఒక హస్త చాలనంతో ఆమెని వారించాను.

అన్వా వినలేదు. ధోరణిని మార్చకుండా గొంతుక మాత్రం కొంచెంమార్చి మళ్ళీ అందుకుంది. "సౌందర్యం! ఓ మీరందరూ సౌందర్యాన్ని సందర్శించినవాళ్ళే. ఎక్కడుందయ్యా, మీ సౌందర్యం? కాఫీక్లబ్బు గోడలమీద రాజకీయనాయకుల పటాల్లోనా? ఆపటాలముందు నాట్యం

చేసే సినీమా తారల భంగిమల్లోనా? ఆభంగిమల పోస్టర్లను చూపించే నాలుగురోడ్లు కలిసే చోట్లలోనా? మీ ఇళ్ళలో పోగుచేసుకొనే సామాన్లలోనా? మీ వక్రమైన అభిరుచిలోనా? మీ శిథిలమైన జీవితాలలోనా? రూపాయి అణా పైసల్ని దాటలేని మీ ఆలోచనల్లోనా? ఎక్కడుంది సౌందర్యం? అసలు మీరు సౌందర్యాన్ని కనిపెట్టగలుగుతున్నారా? కనిపెడితే గౌరవిస్తున్నారా? ఇటు చూడు నన్ను! "ముగ్గుబుట్టవంటి తలా, ముడుతలు దేరిన దేహం, కాంతిలేని గాజుకళ్లు" ఇవి నాకు ఇటీవల వచ్చినవే. పుట్టుకతోనే పుట్టినవి కావు. నన్నూ ఒక అమ్మకంది. నా బాల్యంలో నేనూ నవ్వినదాన్నే. ఆడినదాన్నే. పాడినదాన్నే. నా యౌవనపురోజులు ఊహించగలవా? అప్పుడు నే నెలావుండే దాన్నో ఒక్కసారి స్మరిస్తావా? చిన్నకథ చెబుతా విను. నాజీవితంలో జరిగిన కథ. అప్పుడు నాది ముగ్గుబుట్టవంటి తల కాదు. ఎటువంటి శిరోజాల కోసం మీపత్రికలన్నీ తలనూనె ప్రకటనలు చేస్తాయో అవి సహజంగా నా శిరస్సును అలంకరించాయి. నాది ముడుతలు తేరిన దేహం కాదు. ఎటువంటి చర్మం ఇస్తామని మీ వాసనసబ్బులన్నీ వాగ్దానం చేస్తాయో ఆ నునుపైన సొగసైన చర్మం. ఆనాటి నాకళ్లు కాంతిలేని గాజు కళ్లు కావు కొత్తగా నాకు పెళ్ళిఅయి, అప్పుడే నా మొగాడి ప్రేమ వైపుగా వికసిస్తూన్న కళ్లు. ప్రపంచ కావ్యాలలోని లాలిత్యాలన్నీ వెదకినా ఆనాటి నాకళ్లను ఉపమించవగ్గ

వస్తువొక్కటీ నీకు దొరకదని హామీ ఇస్తున్నాను. ఆలాంటి నేనూ, నన్ను పెళ్ళిచేసుకున్నవాడూ కలిసి ఆ రోజుల్లో ఒక నాడు సంతకి వెళ్లాము. కిక్కిరిసిన జనంలో మేము ఎక్కడో విడిపోయాము. ఒకళ్ల నొకళ్లం వెదుక్కుంటూ తిరుగు తున్నాము. ఒక్క తెనీ స్వతంత్రంగా తిరగడం అదే నాకు మొదటిసారి. అప్పుడు నన్నెవడో అందమైన కుర్రాడు పలక రించాడు. మీ వర్గానికి చెందినవాడే. ఒంటరిగా సంతలో దొరికిన అడదానికి మొగాడుచేసే ప్రతిపాదన చేశాడు. నేను ఒప్పుకోలేదు. నాకో అమ్మా, చెల్లలూ, అందరికన్నా ఆత్మీ యంగా చూసుకొనే ఒకభర్త ఉన్నాడన్నాను. క్షణకాలం అబ్బాయీ, నీతో ఆశపడ్డతర్వాత జీవితకాలమంతా నా మొగుణ్ణి నేను నిష్కళంకమైన కళ్లతో చూడలేనన్నాను. నా దగ్గర వాళ్లంతా నాకు దూరమైపోతారన్నాను. నమ్మి తావో లేదో. ఆ కుర్రాడి కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి. రెండు చేతులూ జోడించి నాకు నమస్కరించాడు. నాకేదో డబ్బు ఇవ్వబోయాడు. తీసుకోనువ్వు. నా చెల్లెలివన్నాడు. వద్ద న్నాను. వెళ్ళిపోయాడు”

“అవ్వా! మొపాసా’ని చీవాట్లు పెట్టినటాల్‌స్టాయిలా గున్నావు” అన్నాను.

ముసిల్ది గుగ్గిలంపడ్డ అగ్గిలా లేచింది. “వరమున బుట్టి తిన్ భరతవంశము జొచ్చితి” అని మళ్ళీ ఆరంభించింది.

అవ్వ జుత్తువేపే చూస్తున్నాను—కథని చేత్తోనలు పుతూ. “ఇవి దుస్స నేను వ్రేళ్ళందపిలి సగము త్రెస్సిపోయి తక్కినయవి” అనే పద్యం జ్ఞాపకంవచ్చింది.

"విను. ఇంకా విను. పోనీ, కథ చెప్పనులే. ఒక సంగతి జ్ఞాపకం చేస్తాను. నువ్వు నన్ను విశాఖపట్టణంలో నీళ్లెండిపోయిన కటకంవారి కోనేటి పక్క ఆకులు రాలిపోయిన మోడు చెట్టుకింద చూశావో, భావించావో అప్పటికే నాకు డెబ్బయ్యేళ్లు దాటాయి. పల్లెటూళ్లో చిన్నతనం లగాయతు పట్నవాసంలో ముసిలితనందాకా నా జీవిత యాత్రంతా నువ్వు స్మరించుకుని ఉండాలి. మోడుచెట్టుకింద బండరాతిపక్క చిట్టచివరకి చేరుకున్నానంటే ఎన్నెన్ని దశలుగడిచానో, ఈలోపున నన్నాస్థితికి తెచ్చిన బహిః ప్రపంచంలో ఎన్నెన్ని మార్పులొచ్చి ఉంటాయో నువ్వూహించుకుని ఉంటావు. డెబ్భయి ఆశ్వాసాల నా మహాకావ్యాన్ని ఒక చిన్న గీతంలోకి ఆవిరిపట్టి నా శోక శాశ్వతత్వం ప్రసాదించావు. సంఘ దురన్యాయానికి యజ్ఞపశువునైన నన్ను పరిపీడితుల, పరాజితుల సమూహాని శోక చిహ్నంగా నిలబెట్టావు. జరామరణ దుఃఖాలను స్మరించేవాళ్లందరికీ నన్నే జ్ఞాపకం తెస్తున్నావు. నా అక్క తేగలమ్ముతే నేం? దానికూతురు రంకుముండ అయితే నేం? మాజీవితాలను, మా వార్ధక్యాలను, మా నైచ్యాలను కూడా మా దారిద్ర్యాన్ని నేటి సంఘ పరిస్థితులమీద సవాల్‌గా వదలుతున్నాం. నీకు తెలుసునో లేదో నేనూ ఒక రకం రమణ మహర్షినే" అంది అవ్వ.

"ఆఁ! అలాగా?" అన్నాను.

"ఔను. ఎడంచేతి వేప్పునుంచి రమణ మహర్షిని" అంటూ అవ్వ అంతర్ధాన మయింది.

---

# కవిసన్మానం

సోమేశ్వర్రావు చెప్పిన కథని నారాయణ బాబుకి చెప్పాను నిన్న సాయంత్రం మైలాపూరు బీచిని, వెలుతురు క్రమంగా వెన్నెలగా మారిపోతూండగా. సోమేశ్వరరావు అదంతా నిజం అన్నాడు. నేను కోరితే ఒట్టుకూడా వేసుకుని ఉండును. సోమేశ్వరరావు చెప్పిన సంగతులే నారాయణబాబుకి చెప్పాను నారాయణబాబు ముక్కుమీద వేలు వేసుకున్నాడు.

ఆ సంగతులే ఇక్కడ రాస్తాను. కాని వాస్తవం కూడా రచనల్లోకి వచ్చేసరికి వాపోయి స్తవం, వం పోయి స్త, స్త వా పో యి వా ఇలా మారిపోతూవుంటుంది. అసలు నేను చెప్పే నిజంకూడా అబద్ధమనుకునే మిత్రులున్నారు. ఇంతకీ నిజం కావలసినవాళ్ళు సోమేశ్వరరావుకి అర్జీ పెట్టుకోవాలి. నేను నిజం తాలూకు నీడను మాత్రమే దాఖలు చేసుకోగలను.

నారాయణబాబూ నేను ఎప్పుడు మాట్లాడుకున్నా కవిత్వం సంగతీ, కవుల సంగతీ మాత్రమే, అయితే మా దృష్టిలో కవిత్వమనేది పరిధిలేని ప్రపంచం కాబట్టి ప్రపంచమంతా మా సంభాషణలోకి వచ్చేస్తుంది. మాదృష్టిలో కలం పట్టినవాడుమాత్రమే కవికాడు. పిపీలికాది బ్రహ్మపర్యంతం ప్రతీ ప్రాణి ఏదో ఒక సంజీవి పర్వతాన్ని వెదుక్కుంటూ బదుకుతుంది. దోమకి నాముక్క సంజీవి పర్వతం.

నారాయణబాబూ అన్నాను నేను, మనం ఎవరూ అక్కర లేదని పారేసినవాటినే కథా వస్తువులుగా ఏరుకుంటాం. సంఘంలోనూ ఇంతే. అందరూ నిరాకరించిన రౌడీలూ, కేడీలూ లేడీలూ మనకి ఆధ్యాత్మిక బంధువులు. వాళ్ళ కథల్లోంచి మహాభారతం పిండి వాళ్ళ జీవితంలో రామాయణం చదువుతాం.

ఆ కథ చెప్పేవు కాదన్నాడు నారాయణబాబు. సోమేశ్వరరావు చెప్పిన కథని నారాయణబాబుకి చెప్పాను. మక్కీ సోమేశ్వరరావుది, ఫక్కీ నాది.

అనగా అనగా ఒక కవి. పాటలూ మాటలూ రాశాడు. బాగున్నాయని కొందరన్నారు. బాగు లేవని మరి కొందరన్నారు. మనం ఏమీ అనలేదు. పత్రికలలో గ్రంథవిమర్శనలు చేసేవాళ్ళుండగా మనకెందుకా గొడవ. బాగుండడం బాగుండకపోవడం కాదు మనకి కావలిసినది రాస్తాడు. అంచేత మన బంధువు. వాడికథ మనం తెలుసుకో దగ్గది.

ఈ రోజుల్లో రెండు రకాల మాలవాళ్ళున్నారు. సినిమాలవాళ్ళూ, డ్రామాలవాళ్ళూ. వీళ్ళు మనమట్టుకి పూజ్యులు. వీళ్లలో వీళ్ళు ఆ పంక్తినించి ఈపంక్తికీ ఆకొమ్మ నించి ఈ కొమ్మకీ రాకపోకలు జరుపుతూ వుంటారు. ఎప్పుడో తప్ప వార్తాపత్రికలు ఎక్కరు.

కవి నాటకలోకంలోనుంచి సినీమాలోకంలోకి గెంతేడు. పుష్పవృష్టి కురిసింది. పాటలు రాలాయి. మాటలు పేలాయి. ఆ ఫిలింపేరేమిటో నాకు తెలియదు. నిజంగా మన కవి ఆ ఫిలింకంపెనీలో పనిచేశాడేమో తెలియదు. చేశా నంటాడు. ఉత్తరాలుకూడా చూపిస్తాడు. అతను మాట్లాడు తున్నంత సేపూ ఆ మాటలు నమ్మకపోవడం అసంభవం. అరచేతిలో ఆర్టీఆసు చూపిస్తాడు. గుమ్చఫ్! ఇంతట్లోకే అది ఇస్పేట్ ఆసు ఐపోతుంది.

ఆ పిల్లపేరు చెప్పను. అప్పటికే అది మూడో అమ్మాయి. వాళ్ల అమ్మదగ్గిర కవి తనకి ఫిలింకంపెనీ దగ్గిర నించి వచ్చిన ఉత్తరం చదువుతున్నాడు. ఇదివరకు ఇద్ద రమ్మల దగ్గిర చదివాడు. అనవసరం. ఆ కథలు మనకిఅక్క ర్లేదు. అవి టర్నర్ సత్రందాకా వచ్చి ఆగిపోయాయి.

కవి చదువుతున్నాడు. ఉత్తరంలో ముక్కలు సోమే శ్వరరావు చెప్పలేదు. తాత్పర్యం మాత్రం చెప్పాడు. దాన్ని బట్టి ఉత్తరం ఇంచుమించు ఎలా వుండి వుంటుందంటే—

"...మేము తెన్గు, కన్నడం, అరవం మొదలయిన భాషల్లో తియ్యబోతున్న ఫిల్ములికి ఏర్పాట్లు చురుగ్గా జరుగుతున్నాయి. తెలుగు ఫిలిం మీరు డైరెక్టు చేసిపెట్టాలి. కనీసం సాంగ్సూ, డైలాగ్సూ రాసిచ్చినా చాలు. హీరోయిన్ పాత్రకి మంచి అమ్మాయి కావాలి. మీ ఖర్చులనిమిత్తం అడ్వాన్సుకింద వెయ్యిరూపాయలు టి. యం. వో. చేశాం. హీరోయినికి మీరెంత జీతం ఇమ్మంటే అంత ఇస్తాం..."

ఈ ధోరణిలో ఇంకా సాగివుండాలి. కవి సొంతంగా కల్పించివుంటే ఇంతకన్నా గొప్పగా ఉండవచ్చుననికూడా నేను వినయ విధేయతలతో అంగీకరిస్తున్నాను.

కవికీ, అమ్మాయికీ, అమ్మకీ జరిగిన సంభాషణ వివరాలు నాకు సోమేశ్వరరావు చెప్పలేదు. ఊహించి రాయగలను. మంచి ఏకాంక నాటిక అవుతుంది. కాని నారాయణబాబూ నువ్వూహించగలవు. సంభాషణ వివరాలు నీ ఊహకి వొదిలేస్తున్నాను. సారాంశం సోమేశ్వరరావు చెప్పాడు, కవితో అమ్మాయిని చెన్నపట్టణం పంపించడానికి అమ్మ ఒప్పకుందని.

ఇద్దరూ బయల్దేరారు. విశాఖపట్నం మజిలీ ఆ రాత్రి టర్నర్ సత్రంలోనే అనుకుంటూ గడిచింది. కళ్ళుమూసుకుని ఈ ఘట్టాన్ని దాటేద్దాం.

చెన్నపట్టణం. బహుశా రామస్వామిసత్రం. ఫ్రెండ్స్ మాత్రం కాదు. కవికి తంతిమనియార్డరు అందలేదని దీని అర్థం. ఫిలింవాళ్లు పంపివుండరని అనుమానం.

అమ్మాయి గడుసుది. ఇదివరకటి రెండు కథలూ ఎరుగును. రెండుమూడు చేతులు చూసిందని సోమేశ్వరరావన్నాడు. హీరోయినీత్వంలోని ఆకర్షణకొద్దీ వచ్చిందే కాని చెన్నపట్టణం ఎప్పుడూ చూడక కాదు.

అమ్మాయిని సత్రంలో దిగ విడిచి కవి అంతర్థానమై పోయాడు. సాయంత్రం మెయిలు ఎక్కగా చూశామని అమ్మాయి తాలూకు గూఢచారులు చెప్పారు. వెంటనే పోలీసులికి రిపోర్టు యిచ్చింది అమ్మాయి.

తర్వాత కథ సోమేశ్వరరావు మంచి మజాగా చెప్పాడు:

మెయిలులైను పొడుగునా టెలిగ్రాములు వెళ్లాయి. మర్నాడు ఉదయం—స్థలం బెజవాడ ప్లాట్ఫారం. కవి పచారు చేస్తున్నాడు. ఇద్దరు మనుష్యులు ఎదురై పలకరించారు. ఎవరండీ చెన్నపట్నంనుంచి వస్తున్నారట. కవిట, సినీమాల్లో మంచి పేరుందిట. ఆయనకి ఊళ్ళో సన్మానం చెయ్యాలనుకుంటున్నారు. ఈ మెయిల్లోనే దిగుతారని తెలిసి వొచ్చాం.

కవి ఆ దుర్గాగా—నేనే, నేనే.

అయితే ఇలా దయచెయ్యండి.

ప్లాట్ఫారందాటి, గేటుదాటి స్టేషన్దాటారు. పది గజాలు నడిచారు.

తమరేనా ఫలానా?

ఆఁ, ఆఁ.

అయితే తగిలించరా బేడీలు అన్నాడు సి. ఐ. డీ. ఇన్స్పెక్టరు.

---

# పంచపాండవులు



హైదరాబాదు వ్యవహారంలో అనవసరంగా జోక్యం కలిగించుకున్నాడని ఒక తెలుగు యువకవిని ప్రభుత్వంవారు నిర్బంధంలో ఉంచారు. ఏ ప్రభుత్వం అని నన్నడక్కండి. నిర్బంధంలో ఉంచడం ప్రభుత్వాల జన్మహక్కు. ప్రభుత్వాలు ఉన్నంతకాలం నిర్బంధాలూ కూడా ఉండితీరవలిసిందే. ప్రభుత్వాలూ. నిర్బంధాలూ లేని ప్రపంచాన్ని ఎప్పటికైనా మనం కళ్ళజూడగలమా అనేదికూడా ప్రస్తుతానికి అప్రస్తుతం. ఇక అసలుసంగతి.

ఆ కవి జైల్లోకూర్చుని ఏవో పాటలూ, పద్యాలూ, కథలూ, కలలూ రాశాడు. వాటిలో ఈదిగువ "కల" నా చేతిలో పడింది. ఇది నాకు ఎలా వచ్చిందని అడక్కండి.

నాచేత అనవసరంగా అబద్ధం ఆడించకండి. తొలినుంచి తుది దాకా ఇదోకల్పితకథ అనుకోండి. అప్పుడెవరికీ ఏ ఇబ్బందులూ ఉండవు. నిజానికి దీనిమాతృక హెన్రీగ్రేస్ రచనల్లో ఉంది. ఓపిక ఉన్నవాళ్లు వెతుక్కోవచ్చు. అప్పుడు తెలుస్తుంది. ఆమాతృక కన్న ఈరచన ఎంత భిన్నమో!

నా చేతిలోపడ్డ దస్తావేజు ఇది: "నిన్న రాత్రంతా సరిగా నిద్దర పట్టలేదు. ఇక్కడికి నేనెందుకువచ్చానో ఎలాగ వచ్చానో తెలీదు. నేనుచేసిన తప్పేమిటి? జీవితానికర్థం ఏమిటి? దీనికో అభివృద్ధీ, ఓక్రమం ఉన్నాయా? నిజంగా ఈలోకం అభ్యుదయ మార్గములోనే ప్రయాణిస్తోందా? ఏది సత్యం? ఏది నిత్యం?

ఇవన్నీ ఆలోచిస్తూ ఉంటే ఎప్పుడో చిన్న కునుకు పట్టింది. ఎంతోసేపు కాదు. ఆ నిద్రలో ఒక పాడుకల కన్నాను. మేలుకున్న తర్వాతకూడా నా విశ్వాసాన్ని కుదిపివేస్తోంది ఆ ఘోరస్వప్నం.

నేనో ఆపరేషన్ టేబిల్ మీద పడుకున్నానట. యుద్ధంలోగాయాలుతిని పడిపోయిన నన్ను శత్రువులు ఖైదీగా పట్టుకుని ఒక పాతాళ గుహాలో పారేశారు. లేదా ఒక పెద్ద రావిచెట్టువేళ్ళసందుస పడుకున్నానేమో? అలాపడుకున్న నాశరీరంలో అన్నిభాగాలూ దృఢంగానే ఉన్నాయి. అయినా ఏదో నీరసం, ఏదో నిశ్శక్తి నన్నావరించింది. పురుగుకన్నా హీనంగా పడిఉన్నట్లనిపించింది.

ఏదో రాయాలని కలం తియ్యబోయానట. నా చెయ్యి దానంతట అది ఊడొచ్చింది. అరచెయ్యీ అయిదు వేళ్ళూ నాకళ్ళముందు గిరగిర గిరగిర తిరుగుతూ ఉంటే నా కళ్ళు కూడా తిరిగిపోయాయి.

అలా ఎంతోసేపు కళ్ళూ కళ్ళముందు వేళ్ళూ తిరిగాయో తెలీదు. ఎప్పుడో ఈపరిభ్రమణం హఠాత్తుగా ఆగిపోయి అయిదు వేళ్లూ వరసగా నాకళ్లముందు నిలబడ్డాయి. క్రమంగా అవి మనుష్యుల ఆకారం ధరించాయి. నిజంగా మనుషుల్లాగ కాదు. అప్పుడప్పుడు ఎండిపోయిన చెట్టు కొమ్మల్లోనూ, నామకప్పిన పాతుగోడలమీదా, సముద్రతీరంలో కెరటాలు తినివేసిన రాళ్లలోనూ, మనకు మనుష్యాకారాలు కనబడతా, అలాంటిరూపాలు.

కొంతసేపు జాగ్రత్తగా ఆ రూపాలను చూశాను. బాగా చూడడానికవకాశం ఇచ్చి, తర్వాత అవి నీడల్లోకి తప్పుకున్నాయి. అయిదుగురూ అయిదురకాల భీభత్స రూపంలో కనబడ్డారు.

మొదటివాడికి కళ్లుండవలిసినచోట రెండు ఆలిచిప్పలూ వాటిలో రెండు కుంకుడు పిక్కలూ ఉన్నాయి. కింది దవడ లేనేలేదు. చేతకాని కుర్రాడెవరో చేసిన మట్టిబొమ్మలాగున్నాడు.

రెండోవాడికి ఒక కాలూ, ఒక చెయ్యీ, ఒక చెవీ లేవు. ఒళ్ళంతా వాచిపోయి గాలిఊదిన రబ్బరుబొమ్మలాగ ఉన్నాడు.

మూడోవాడికి ఒంటినిండా కురుపులు. బహుశా అవి ముచ్చిరేకులు కాబోలు. భుజకీర్తులు ఊడిపోతే అవి మళ్లీ అంటించుకోవాలని తాపత్రయపడుతున్నాడు.

నాలుగోవాడు అయిదోవాడూ ఇంచుమించు ఒక్కలాగే ఉన్నారు. అయిదోవాడు ఒక పిసరుపొట్టి అంతే భేదం ఇద్దరినీ ఎండిపోయిన ఈతాకులతో చేసినట్టుంది. వాళ్ళ శరీరాలలో ఒక్కొక్క అంగానికి ఒక్కొక్క జబ్బు పట్టుకున్నట్టుంది. మొత్తంమీద అన్నీ కుళ్ళిపోవడపు వివిధ దశలను ప్రదర్శిస్తున్నాయి. ఎంతో ప్రయత్నంమీదగాని ఇది ముక్కూ ఇది జబ్బా, ఇది చెయ్యా, ఇది పాదం అని పోల్చుకోలేం. వాళ్ళ విశాలమైన వక్షస్థలాలమీదనుంచి అరటినారలాంటి ఉత్తరీయాలని తొలిగించి చూపిస్తే లోపలి శరీరభాగాలు కనిపించాయి. వాటినికూడా దారుణమైన రోగక్రిములు ఆక్రమించుకున్నాయి. వైద్యగ్రంథాలలోని త్రివర్ణ చిత్రాలలాగున్నారు వాళ్ళిద్దరూ.

అందరి పరిచయం నాకయిందని వాళ్ళకి పూర్తిగా నమ్మకం కుదిరిన తర్వాత అందరి తరఫునా మొదటివాడు, కిందిదవడ స్థానే తనచేతిని వాడుతూ బోధపడీ బోధపడని చప్పుళ్లుచేస్తూ, నోటినిండా వేడి కోడిగుడ్డు కుక్కుకుని నములుతున్నవాడు మాట్లాడినట్లుగా ఒక ప్రకటనచేశాడు.

"మేము ఆయిదుగురు అన్నదమ్ములం. మాపేర్లు। ధ, భీ, అ, న, సహ! మహాభారత యుద్ధానికి పూర్వం

మాకు పెద్దపెద్ద పేర్లు ఉండేవి. ఒక్కొక్క యుద్ధంతో మానవజాతి అభివృద్ధిచెంది మాపేర్లు హరించుకుపోతూ వచ్చాయి. ఇంకో యుద్ధంవస్తే మాలో నలుగురి పేర్లు పూర్తిగా హరించుకుపోయి ఆనందంతో అసలే చప్పుడుచెయ్యడం మానేస్తాయి. ఆఖరివాడొక్కడు మాత్రం సకారంతో మిగులుతాడు. మేమంతా ఒక ఆకురూపమో, తీగరూపమో ధరించి మనందరికీ ఆశ్రయం ఇచ్చే ఈ రావిచెట్టు అభివృద్ధికి సాయపడతాము."

అందరికన్నా పెద్దవాడు ఈ కథ సరిగా చెప్పినట్టు నమ్మకంలేక మిగిలిన నలుగురూ ఒకరి తర్వాత ఒకరు నాముందు మాటలతో ఒకడూ, సంగీతంతో ఒకడూ భరతనాట్యంతో ఇద్దరూ చాలాకష్టపడి చెప్పి నాకు బోధపరచడానికి ప్రయత్నించారు.

"ఇది వెనకటి కథే! ఇందులో కొత్తేమీలే"దన్నాను నేను.

భీకరంగా రెండోవాడు నావేపు చూసి ఇలా అన్నాడు "బతకడం అనేజబ్బుతో బాధ పడుతున్నావు నువ్వు. ఇప్పుడున్న వయస్సులో మానవజాతి మాకథని అర్థంచేసుకోలేదు. నిన్ను తలదన్నిన వాళ్ళు వ్యాఖ్యానాలకి ప్రయత్నించి మరణంలో మంటగలసి పోయారు. అన్నదమ్ముల యుద్ధమనే ప్రధాన కథా బీజంలోంచి బయలుదేరే రెండు దళాలు ఈ రావి చెట్టుగా ఎదుగుతున్నాయి. నువ్వు ఇంకో నూరేళ్లు బతికినా

ఈ రహస్యాన్ని గ్రహించలేవు. ఈలోపున నువ్వు చచ్చిపోతే ఈ సృష్టికొక లోపంరాదు."

వాళ్ళు మాట్లాడడం మానేశారు. ద్వాపరయుగం కడిచి పోయింది. కలియుగం కడిచి పోతోంది. ఈలోపున సామ్రాజ్యాలు లేచాయి, పడిపోయాయి మానవులు యుద్ధాలు చేశారు, గెలిచారు, ఓడిపోయారు. అమోఘమైన స్వార్థ త్యాగాలని చరిత్ర లిఖించింది. కోటికోటిసార్లు సూర్యుని ఉదయాస్తమయాలు సాగిపోగా కొత్తకొత్త మారణ సాధనాలను మానవుడు కనిపెట్టగలిగాడు.

మళ్లీ వాళ్లు అన్నారు. "ఈ నాడు చూస్తున్న ఈ వికార రూపాలలో నువ్వు మమ్మల్ని పోల్చుకోలేవు. స్వాతంత్ర్యం అంటే ఏమిటో తెలుసుకుని అనుభవించిన మేము భగవంతుని ధర్మశాసనాన్ని ప్రతిఘటించం. ప్రకృతి లిఖితాలకి జాగా ఇచ్చే పాల రాతిఫలకాలం మేము. ఆవిడయొక్క జ్ఞానానికీ, వైవిధ్యానికీ మేమే నిదర్శనం. జడుసుకోకు మమల్ని చూసి! అనుక్షణం మా ఆకారం మారిపోతూనే ఉంది. ఈ చెట్టు లాగే! కాని దీనిమార్పులు చప్పున కనబడేవి కావు.

"మాకు ప్రసాదించబడ్డ ఈ రోగాలని అసహ్యించుకోవడం మానేశాం. కరుణాసముద్రుడైన భగవంతుడు పంపించినవి కాబట్టి ఆయన మాకు చేసిన మర్యాదను గుర్తించి అతడు పంపిన జబ్బులికి మా శరీరాల్లో ఆతిధ్యం

ఇస్తున్నాం. మా శరీరాలు ప్రకృతిదేవిగారి రాసాయనిక పరిశోధనశాలలు. ఈ పరిశోధనలని అటకాయించ మంటే జీవితాన్నే అభ్యంతరపెట్టట మన్నమాట."

మన్వంతరాలు దొర్లిపోయాయి. మళ్లీ వాళ్లిలా అన్నారు.

"మానవుడెప్పుడూ ఒక్కరూపంలోనే ఉండాలని ఎవరు శాసించారు? భగవంతుడి రూపమే ఎప్పటికప్పుడు మారిపోతోంది. సత్యం ధరించే స్వరూపాల సంఖ్యని నువ్వు లెక్కపెట్టగలవా? సౌందర్యం ఈనాటిదా? అయితే మానవుడొక్కడే ఎంచే, ఈవిశాల విశ్వంలోని అన్ని రూపాలనీ ధరించి అన్ని జీవితాలనీ అనుభవించలేడు? ప్రయత్నించు. అది నీకు అతి సమీపంలోనే అందుబాటులో ఉంది."

అయిదు ఆకారాలూ నాచుట్టూ తిరుగుతూ పాడుతూ ఆడుతున్నాయి.

"నీకు విముక్తి తెస్తున్నాం. నీకు స్వాతంత్ర్యం ఇస్తున్నాం. నీకు దేవుణ్ణి బహుమానం చేస్తున్నాం." అని ఉచ్చైస్స్వరంతో వాళ్ళు ఆలాపన సాగించారు.

నేను నోరు తెరవబోయాను. కింది దవడ కిందపడిపోయింది. నాకళ్లు లోపలి లోపలికిపోయి నోట్లోకి వచ్చేస్తున్న ట్టనిపించింది. నాలుగో వాడు తన కురుపుల వేళ్లతో నన్ను నిమురుతున్నాడు. వాడు నిమిరినచోట నాకు రెక్కలు మొలిచినట్లయింది. "మేము నీ స్నేహితులం! మమల్ని

నమ్మ! జీవితము తాళపు చెవులు నీ చేతిలో పెడుతున్నాం. దేవుడికి నిన్ను చేరువగా తీసుకు వెళుతున్నాం" అన్నారువాళ్లు.

భయంతో కళ్లు తెరిచాను. నా జైలు గది! చీకట్లోనే పొల్చుకున్నాను.

భగవంతుడనీ, అభ్యుదయమనీ, సత్యమని, ధర్మమనీ, సుఖదుఃఖాలనీ, జనన మరణాలనీ మనం అనేస్తున్నప్పుడు మనకే తెలియకండా ఎంతెంత ప్రచండ శక్తులని మేలుకొల్పుతున్నామో ఆలోచిస్తూ ఉంటే ఆశ్చర్యం కలగదూ?

రెక్కలు ధరిస్తేమాత్రం ఎక్కడికి వెళ్లగలవోయ్ మానవుడా?

---

# ఒక్కల





ఒక్కల, ఒకకల, ఓకల, నిన్నరాత్రి నేను కన్న ఒకకల. మొగాళ్ళు కలలుమాత్రమే కంటారు. ఆడవాళ్ళు కలల్నీ పిల్లల్నీ కవల! పిల్లల్నీ కనగలరు. ఇది ప్రారంభం, విష్కంభం.

అసలు కల కథ... ఎక్కడకో పోతున్నాను. కలకి కాలంలేదు. స్థలం కూడాలేదు. కలని కథగా రాయాలన్నా ఫిల్ముగా తీయాలన్నా ఎక్కడ ప్రారంభించాలో ఎక్కడ ముగించాలో తెలియదు.

ఎక్కడ జరిగిందో తెలియదు. ఏంజరిగిందో తెలియదు. అయినా ఎక్కడో ఏమిటో చెప్పడానికి ప్రయత్నిస్తాను.

మీరు వెలుగులోనో చీకట్లోనో మేడమెట్లు ఎన్నో సార్లు ఎక్కేవుంటారు. ఎన్నో కొన్నిసార్లు దిగేవుంటారు. నా

కలలో నేనుచేసినపనికూడా అదే. కాని- అదుగో అక్కడే వుంది. ఈ మెట్లు ఎక్కుతున్నానో దిగుతున్నానో తెలియదు. వెలుగో చీకటో తెలియదు. నా కలని మాటల్లో మళ్ళా చెప్ప టానికి ఎందుకుకష్టపడుతున్నానో ఇప్పుడుమీాకు తెలిసిందను కుంటాను.

ఇంకో చిక్కుకూడావుంది ఇందులో. ఈ యెక్కడం దిగడం నేనొక్కణ్ణేకాదు. నాతోబాటు మరోమనిషికూడా నాకన్నముందుగా, నాకుదారిచూపిస్తూ కాదుకాదు, నా వెన కాతల నేనుతీసినదారినే నేను దిగిపోతూవుంటే నాతోపాటు దిగిపోతూ, నేను మెట్లుయెక్కుతూవుంటే నాతోబాటు ఎక్కుతూ!

కథ చెప్పలేక నేను పడుతున్నచిక్కులు గమనిస్తు న్నారా? నేను ఒకరివెంట పడ్డానా? నా వెనక ఒకరు పడ్డారా? అధోలోకాలికి దిగిపోతున్నానా? ఊర్ధ్వలోకా లెక్కుతున్నానా?

నాచిక్కు యిక్కడతో తీరిపోలేదు. నాతోపాటు వస్తున్న, లేదా పోతున్న నా కామ్రేడ్ మొగాడా? ఆడదా?

సామాన్యంగా మనం పత్రికల్లోచదివే కథల్లో ఈ యిబ్బందులుండవు. మాటవరసకి, చలంగారికథలో యెవడు మొగాడో యెవతె ఆడదో స్పష్టంగా తెలుస్తుంది. వాళ్ళు మేడమెట్లుదిగితే దిగినట్టుతెలుస్తుంది. ఎక్కితే ఎక్కినట్లు తెలుస్తుంది. అక్కడ స్పష్టతతప్ప సందేహములేదు.

చిన్న చిన్న కథకులు కూడా ఎంతో ముద్దుగా స్పష్టంగా కథ అల్లుకుపోతారు. ఏవో పాత్రల్ని సృష్టిస్తారు. ఏవో సన్నివేశాలు కల్పిస్తారు. మనకు నవ్వో, ఏడుపో, భయమో, అసహ్యమో ఏదో ఒకటి కలిగిస్తారు. వాళ్ళ కథలు కలలు లాగా వుండ నేవుండవు

నేను కథ రాయడం లేదు. కల రాస్తున్నాను. ఇది కలరా అని మీరనుకుంటారు. కలసంగతి మాటల్లో చెప్పడం కష్టం. గొప్పకళ గొప్పకల! అది ఏక కాలంలో మనకు నవ్వూ, ఏడుపూ, భయం, కోపమూ, అసహ్యమూ, ఆవేశమూ ఇంకా ఎన్ని ఉంటే అన్నీ కలిగిస్తుంది అటువంటి కల మానవజాతికింకా లభ్యంకాలేదని చింతిస్తున్నాను.

నిన్న రాత్రి నేనుకన్న కలని జ్ఞాపకం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. అందులోవున్న చిక్కులుకూడా మీకు దాపరికం లేకండా విన్నవించు కుంటున్నాను.

కల ఎక్కడ జరిగిందంటే మెట్ల మీద. ఎక్కడం జరిగిందో దిగడం జరిగిందో తెలియదు మెట్లమీద నేనొక్కడి నేలేను. నాతోబాటు ఇంకో వ్యక్తి. బహుశా నేనేనేమో? లేక నా నీడ, నా ప్రేమించిన మిత్రుడు, నే ప్రేమించిన ఆడది ఎవరో, ఏమో! కలలోనే అయితేనేం. ఇంకొకళ్ళతో కలిసి పోవడం. అబ్బా! ఎంతయిబ్బంది.

ఇద్దరం దిగిపోతున్నాం, గబగబా! గబగబా! మధ్యమధ్య రెండేసి మూడేసి నాలుగేసి మెట్లు వదిలేసి దిగి

పోతూన్నాం! ఎంతసుఖంగా దిగిపోతున్నాం! గబగబా! గభగభా! భగభగా! గగభగగా! గాగాభాగాగా! గాభాగా! గాగా! గాభగాగా! బాగా!

అలాగే, ఎక్కిపోవటం కూడా! మొదట్లో ఏమీ ఆయాసం తోచలేదు. అంతా బాగానే సహజంగానే జరిగి పోతోంది. ఎక్కడానికి దిగడానికి భేదం కనిపించలేదు. రానురాను మెల్లెక్కుతూ వుంటే ఆయాసం ఎక్కువయింది. రెండో వ్యక్తి బరువు కూడా నామీదపడింది. నన్ను దిగ జార్చాలని ఆవ్యక్తి ప్రయత్నిస్తున్నట్టనిపించింది. ఆవ్యక్తి ఎవరో కాదు నాలోవున్న రాక్షసత్వమేనని నాకిప్పుడు తోస్తూంది,

రాక్షసత్వం ప్రేరేపణకి లోబడి దిగిపోతున్నాను. ఎంతో బాగుంది ఆ అనుభవం. దాన్ని నేను వర్ణించలేను.

కాని నాలోనే ఇంకొకవ్యక్తి నేను దిగిపోతున్నానని హెచ్చరించినట్లయింది. వెంటనే నా గమనం ఊర్ధ్వ దిక్కు పట్టింది!

ఎక్కడం అనుభవంకూడా ఎంతో బాగుంది! ఎంత బాగుందంటే అంత బాగుంది. అంతకన్నా ఎక్కువ నేను వర్ణించలేను.

దేవత్వం ఊర్ధ్వగమనాన్ని రాక్షసత్వం అధోయాత్రని ప్రోత్సహించాయని ఇప్పుడు మేలుకున్న నేను విడివిడిగా విడ

దీసి చెప్పగలుగుతున్నానేగాని అప్పుడా స్వప్నంలో ఏదికిందో ఏదిమీదో ఎరగనే ఎరగను.

ఇలాంటి కలలు యెందుకొస్తాయో నాకు! ఇంతకూ దీని సారాంశం ఏమిటి? ఏమీలేదు. దిగడం దించడంసులభం, సుఖం! ఎక్కడం, ఎత్తడం (మనల్నీ మన సహచరులనీ) కష్టం, దుఃఖం! కాదు సుఖం. ఔను సులభం! మనం ఎక్కడున్నామో ఎప్పుడున్నామో ఎక్కనున్నామో దిగనున్నామో ఎందుకున్నామో ఏం కన్నామో అప్పుడప్పుడు కలల్లో, అదీ అస్పష్టంగా తెలుస్తుంది. దాన్ని సాధ్యమైనంత స్పష్టంగా (నీకే కాక అందరికీ) మాటల్లోనో, రంగుల్లోనో, సంజ్ఞల్లోనో, ధ్వనుల్లోనో లేదా సినిమాలలోలాగా ఈ అన్నింట్లోనో తెలియజెయ్యగలగడం కళ!

---




ఒక సాయంత్రం (వాడి పేరు చెప్పను)

కనబడ్డాడు. "బయల్దేరు" అన్నాడు. ఎక్కడకని అడిగి లాభంలేదు వాడితో. హఠాత్తుగా ఇలాగే ఎన్నోసార్లు కనబడి ఏవో ప్రతిపాదనలు చేస్తూ వుంటాడు. నేను మారుమాట లేకండా వాటిని శిరసావహిస్తూ ఉంటాను. "అనుభవం జ్ఞానానికి జనకుడు" అంటే నేను నమ్మను. అలాగే "అవసరం సృష్టికి జనని" అనే సుభాషితంలోకూడా నాకు నమ్మకంలేదు. అంటే పూర్తిగా నమ్మకం లేదనాలి. ఇవన్నీ సగం సత్యాలు కాబట్టి సగం సగం మాత్రమే నమ్ముతాను.

ఇద్దరం బయల్దేరిన తర్వాత వీడు (ఎవరి పేరైతే చెప్పదలుచుకోలేదో వాడు) "ఇప్పుడు మనం లక్షాధికారులం కావడం ప్రారంభిస్తున్నాం. తక్షణమే! జోరుగా నడు" అన్నాడు. ఇద్దరం తక్షణం ప్రారంభించాం. కాని ఆ ప్రారంభం ఇప్పటికీ ప్రారంభదశలోనే ఉండిపోయింది. అప్పుడు బయల్దేరిన మేము ఇంకా బయల్దేరుతూనే ఉన్నాం

* * *

ఈసాయంత్రం ఇక్కడ ఈ నగరంలో ... సముద్రం లాంటి ఎడారిలాంటి ఆకాశంలాంటి సముద్రంలాంటి ఎడారి లాంటి ఎడారి, సముద్రంలాంటి ఎడారి, ఆకాశంలాంటి ఎడారి, ఎకసక్కెంలాంటి ఎడారి...

ఇక్కడ ఈ నగరంలో ట్రాంలో నేను... ఎదురుగుండా సెలూన్‌లో అద్దంలో నేను; అదైనా క్షణంలో సగంసేపు!

అదీ అసలుసంగతి. ట్రాంలో వెళ్ళుతున్న నేను సెలూన్‌లో అద్దంలో క్షణంలో సగంసేపు నన్ను నేను ప్రతిబింబించి నాకు నేను కనిపించాను. క్షణంలో సగంసేపు ఒకే సారి సెలూన్‌లోనూ ట్రాంలోనూ నివసించాను.

ఇక్కడ ఈ సాయంత్రం...

ఎడారిలో ఆకాశంలో క్షణంలో సగంలో ట్రాంలో సెలూన్‌లో జనంమధ్య సముద్రంమధ్య జనసముద్రంమధ్య నేను.

ఇక్కడ ఈ నగరంలో ఈ క్షణంలో సగంసేపు ఏమిటి జరుగుతోంది ?

"మనం లక్షాధికారులం కావడం ఎప్పుడు ప్రారంభిస్తాం" అని ప్రశ్నించేడు నైనకన్ను. వాళ్ళిద్దరూ నాయరు దుకాణంలో నిన్నటి పకోడీలు నములుతున్నారు.

"ఇదిగో ఈ క్షణం" అన్నాడు దొరసామి. "టీ తీసుకున్న తక్షణం."

"డబ్బులు చాలుతాయా" అన్నాడు నయనకన్ను.

నాయరు రెండుగ్లాసులతో టీ తెచ్చి— వాళ్ళ ముందుంచి పోయాడు.

"గుర్రాలు మోసంచేశాయని చెబుదాం. అరువుంటాడు నాయరు" అన్నాడు దొరసామి.

* * *

అక్రమ లాభాలమీద అదనపు పన్ను తగ్గింపు. ఆర్థిక పరిస్థితిమీద కేంద్రప్రభుత్వపు దండయాత్ర కృషి. ఇతోధిక కృషి. ద్రవ్యోల్బణము. దాని నరికట్టుటకు ఆరుమార్గాలు. రామపాదాల పీఠనడక. అన్నివేళలూ తేనీటి వేళలే.

* * *

కాకమ్మ చక్కని చుక్క. నిజంగా ఆ పేరుకి తగ్గది కాదు. పదేళ్ళ కిందట మరీ బాగుండేది. అప్పుడు సినీమాలో నటించడాని కిక్కడకి వచ్చింది. ఒక కెమేరా మనిషి ఆమె శరీరాన్ని అనేక కోణాలనుంచి చూసి చవిచూసి 'నువ్వు

మంచంమీదకే కాని తెరమీదకి పనికిరా' వన్నాడు. దరిమిలాను చాలామంది ఆ అభిప్రాయాన్ని స్థిరపరిచారు. ఇప్పుడు కాకెమ్మ ఇంకో మంచంమీదకి వెళ్ళబోతూంది.

*　　　*　　　*

దశవర్ష ప్రణాళిక బుట్టదాఖలా. బంగారంధర పడిపోవడంవల్ల బ్యాంకులికి మూడురోజులు సెలవు. ఈ రాత్రి చంద్రుడు నూటికి 75 వంతుల నష్టంతో వ్యవహరిస్తాడు. అనుకోని గుర్రాల అకస్మిక విజయం.

*　　　*　　　*

జమీందారు సొంతకారు నడుపుకుంటూ జోరుగా పోతున్నాడు. స్వరాజ్యం వచ్చిన తర్వాతనో అంతక్రితం ఆ రెండు నెలల పూర్వమో జమీందారు జాతీయమతం తీసుకుని దీక్షావస్త్రాలు ధరించాడు. పేవ్‌మెంటుమీద నడుస్తున్న కుర్రాడు జమీందారును చూశాడు. కుర్రాడి జేబులో వేడి వేడి వేరుశనగపప్పుంది. పిడికిటినిండా వేరుశనగపప్పు తీసుకుని పట్టుకున్నాడు.

కద్దరు దుస్తులతో కనుపండువుగా కనబడుతూన్న జమీందారుని వేరుశనగపప్పుతో అభిషేకించాలన్న ఆశ ఆ కుర్రాడి మనస్సులో మెరుపులాగ మెరిసింది. కాని ఒక నిశ్చయానికి రాలేకపోయాడు. కారు జోరుగా దాటిపోయింది.

*　　*　　*　　*

జగద్విఖ్యాతి వహించిన షేక్స్పియరు మహాకవి నాటకం హేమ్లెట్. మనస్సు స్థిరపరచుకోలేకపోయిన మానవుని విషాదాంత గాథ.

"ఉప్మా పట్రా" అన్నాడు. పట్టుకొచ్చాడు అయ్యర్వాళ్. తింటున్నాడు తెమ్మన్నవాడు. అందులో రెండు రాళ్ళున్నాయి. కాఫీ తీసుకోకండానే బిల్లు తీసుకుని డబ్బు చెల్లిస్తూ "ఉప్మాతో బాటు రెండు రాళ్ళు ఎక్కువగా ఇచ్చాడు. అంచేత వాటికి నా యథాశక్తి ధర రెండర్థణాలు ఒక అణా చెల్లిస్తున్నా" నని అణా ఎక్కువ ఇవ్వబోయాడు. నేతాజీ విలాస్ కాఫీ క్లబ్బు (ఇక్కడ పదార్థాలు కల్తీలేని నేతితో చెయ్యబడవు) ప్రొప్రయిటరు అణావైపు అతి భయంకరంగా చూశాడు. "ఎవరైనా బిచ్చగాడికి ధర్మం చేసుకో" అన్నాడు. రాళ్ళధర చెల్లించదలుచుకున్న మనిషి అణాకాసుని జేబులో వేసుకుని రెండు అయిదు రూపాయల నోట్లు బల్లమీద పెట్టి వెళ్ళిపోయాడు.

"వెర్రివెధవ" అనుకున్నాడు ప్రొప్రయిటరు, రూపాయినోట్లను దాచేస్తూ.

ఆ సమయంలోనే ఒక అణాకాసు అడుక్కునే అమ్మి డబ్బాలో పడ్డ చప్పుడయింది.

*　　*　　*

"కమ్యూనిస్టులను పాతేస్తున్నాం" అన్నారు దొరతనం వారు. పాతేస్తున్నారు. వానలు కురిస్తే దేశం అంతటా కావలసినంత పంట.




చక్కని పద్యాలు రాసిచదివి నీకు వినిపించాడే చవితి నాడు, ఆ కుర్రాడు చాలా బాధపడుతున్నాడని వినీ విన గానే నా కేదో వేదనా, అణులేశం ఆ వేశం ఆ మట్టునే ఆగ్ర హం వచ్చి, అటువంటివాళ్ళ అవస్థలమీద ఖర్చు పెట్టడానికి నాదగ్గర కన్నీళ్ళు లేవన్నాను.

బాధపడడం చేతకానివాళ్ళు పద్యాలు రాస్తే, బాధ పడడం భరించలేనివాళ్ళు పద్యాలు చదివితే, పద్యాలు అందు లోకీ యతిప్రాస లేని అర్థంలేని పద్యాలు రాసి బాధపడడం అర్థంలేని బాధపడడం, యతి ప్రాసల్లేని బాధపడడం అన్నా న్నేను.

ఆ కుర్రాడు నాదగ్గిరికి వచ్చిన మాట నిజమే. పద్యాలు చదివినమాట నిజమే. నేనతణ్ణి పొమ్మన్నమాటా నిజమే. ఎందుకు పొమ్మన్నానో చెప్పడానికే ఈ కథ

కథా అన్నాను? సంఘటనల్లేని సంచలనంలేని కర్త కర్మ క్రియల్లేని కథనాన్ని కథనడం ఎలా? ఇప్పుడే చెబు తున్నాను- ఒక పూరెల్లుగాని, పచ్చకర్పూరంగాని, చివరి కొక సిగరెట్టు కాని తగలెట్టేటప్పుడు బయల్దేరే పొగలో కనిపించే కదలిక పాటిదికూడా ఈ రాతలో మీకు కనబడదు. మెదడు తగలబడిపోయేటప్పటి పొగకాని, పొగ కదలనట్లు కనిపించే కదలడం, జరగనట్టు కనిపించే జరగడం ఇందులో చూపించాలని ఎందుకో ప్రయత్నం.

నీ తరువాతి తరం యువ కవి నీదగ్గరకి వచ్చినప్పుడు నిర్దాక్షిణ్యంగా పొమ్మన్నావు. అతని పాటలోని బాధ నీకళ్ళ వెనక నీళ్ళలో ఈదుతోందని నీకు బాగా తెలుసు. అయినా పొమ్మన్నావు, ఉప్పెనగా ఉద్గమించబోతూన్న కన్నీళ్ళను అటకాయించి!

"అపాయానికి ఇటూ దారి" అని ఎక్కడైన ఎవ రైనా ఒక హెచ్చరికను ప్రతిష్ఠిస్తే ఎంత బాగుండును! అప్పుడు మనం అంతమందిమీ అటు వెళ్ళడం మానేద్దుము.

మానేస్తామా? ఏమో అబ్బా! నామట్టుకు నేను అపాయాలని అన్వేషించడంలోనే ఆనందం పోగుచేసు కుంటాను. ఇంకా ఎందరో ఉన్నారు ఇలాంటి నాలాంటి వాళ్లు. అపాయం స్వభావాన్ని అనుభవంలో తెచ్చుకోవా లంటారు వాళ్లు. నిషేధాలు విధిస్తూ నిలబడే పోలీసుబలం నిరుపయోగం వీళ్ల విషయంలో.

అపాయం బోర్డుకట్టి అటు వెళ్ళకండా ప్రజల్ని శాస నాలద్వారా అరికట్టి అపాయానికి ఇవతలివేపు క్షేమాన్ని వెదజల్లడానికి ప్రభుత్వాలన్నీ కృషిచేస్తూనే ఉంటాయి. కాని ఏం లాభం? అవతల ఏముందో చూడడానికి మానవునిలో కుతూహలం ఉన్నంతకాలం బోర్డుచేసే హెచ్చరిక నిశ్శక్తం నిర్వీర్యం.

సుమతిశతకం స్తవనీయమే. సెన్సారు బోర్డు అభిలష ణీయమే. శాసనసభ అవశ్యం గౌరవనీయమే. అయితే నేం? అపాయానికి కల ఆకర్షణని నేను కొనియాడడం మానలేను.

ఈ కుర్రాడున్నాడే వీడు అపాయాల స్వభావం కనిపెట్టాలనే ఉబలాటం ఉన్నవాడు. ఆ పద్యాలు చదివి నప్పుడే తెలిసింది నాకా సంగతి. పద్యాలుగా అవి బాగానే ఉన్నాయికాని అవి బతకవని నాకు తెలుసు. ఎందుకోచెప్పనా?

ఒకసారి నేను చాలా ప్రమాదకరమైన పరిస్థితిలో చిక్కుకున్నాను. ఎవరిదో అరచెయ్యి, దానిమీద ఒక గుండు సూది అంటీ అంటనట్లు నిలబెట్టి ఉంది. దానిమీద నేను ఒంటికాలిమీద నిలుచున్నాను. అంతవరకు బాగానే ఉంది అటువంటి సర్కస్ ఫీట్లు నేను సునాయాసంగా సాగించ గలను. ఇక దిగిపోదా మనుకుంటూన్న సమయానికి నా నెత్తి మీద గ్రంథాలయాల దండయాత్ర ప్రారంభమైంది. ఎంత బరువుందో ఇప్పుడు జ్ఞాపకం లేదుగాని ప్రపంచ కవుల రచనల సంపూర్ణ సంపుటం నా తలమీద వచ్చి వాలింది. దాని మీద నానా భాషల నిఘంటువులు. ఉగాదిసంచికలు ఒత్తు తున్నాయి. ఇంకా ఇంకా మీది మీదికి పోనుపోను అనం తంగా అనేక గ్రంథాలు. షేక్స్పియరు సమస్త రచనల మేలు ముద్రణం వ్యాఖ్యాన గ్రంథాలతో సహా నోస్ డైవ్ చేసి నప్పుడు నా మెదడులో అణువు బద్దలైనట్టయింది. ఆకాశం వేపు పెరిగిపోతూన్న గ్రంథాలభారం నన్ను కుంగదీస్తోంది. అంత సేపూ ఒంటికాలుతో గుండుసూదిమీద నిలబడే ఉన్నాను. గుండుసూదిని కదలకుండా నిలబెట్టగలిగినవాడి చాకచక్యానికి తీసిపోకూడదని పౌరుషానికి నిలుచున్నాను, భారబాధభరిస్తూ. కాలైనా మార్చుకోడానికి వీల్లేదు. నా నెత్తిమీద ఎన్ని పుస్తకాలున్నాయో స్పష్టంగా తెలియదు. వాతావరణం లోని వివిధ పరిమళాలను చర్మంతో పీలుస్తూ గ్రంథాల పేర్లు పోలుస్తున్నాను. మధ్యమధ్య ఎక్కాలపుస్తకాలూ అచ్చు

తప్పులతో నిండి అణాకీ అర్థణాకీ అమ్ముడుపోతున్న చవకబారు పుస్తకాలూ గుచ్చుకుంటున్నాయి. అమూల్యమైన తాటాకు గ్రంథాలలో తంజావూరు లైబ్రరీ నా నెత్తిమీద పడింది. తామ్రశాసనాలూ శిలాశాసనాలూ తగులుతున్నాయి. నారక్తనాళాలలోని నెత్తురు వాటి ఒత్తిడిని అనుభవిస్తోంది.

నామీద గ్రంథాలూ నాకింద గుండుసూది! ఏ తెలియరాని గణితశాస్త్రసూత్రంవల్లనో అవి నిలబడి నన్ను నిలబెట్టాయి.

అరచెయ్యి అభయహస్తం. పడిపోతానని భయం లేదు గాని పాడడానికేమీ తోచలేదు. పాడాలనే బాధమాత్రం పొడుస్తోంది. ఏదిపాడినా ఈ పుస్తకాలసారమే. జీవితానుభవమే కావ్యవస్తువు కావాలని నా కిప్పటికింకా తెలియదు.

ఈ యిరుకు పరిస్థితిలో చిక్కుకుని ఏదో పాట పాడాను. ఆపాట చాలామందిని ఆకర్షించింది కూడా. అరచేతి కిరుపక్కలా ఉన్న అగాధమైన లోయలో లెండోపతాండాలుగా కిక్కిరిసిపోయిన ప్రేక్షకజనం అయిదు నిమిషాల ఇరవై సెకెండ్లసేపు కరతాళధ్వనులు చేసి నా పాటని అభినందించారు.

ఆ పాటకి ముగ్ధుడైపోయాడు ఈ కుర్రాడు. దానికి అందమైన అనుకరణం తయారు చేశాడు. అదీ నాకోపం. అందుకే అతణ్ణి పొమ్మన్నాను. అందుకే అతని పాటలు బతకవన్నాను.

నువ్వు స్వయంగా అపాయాల్లోకి వెళ్లు. ఎరువు తెచ్చుకున్న అభిప్రాయాల్ని తగలబెట్టడానికి వీలుగా ఒక అగ్గిపెట్టె నీతో తీసుకువెళ్లడం మరిచిపోకు. గుండునూదిమీద ఒంటి కాలితో నిలబడడం గొప్పమాటే. కాని అదే అంత గొప్ప కాదు. ఇంకో కవి - ఎంత గొప్పవాడైనా - నువ్వు వాడివి కావాలని ప్రయత్నించకు. ఇన్నాళ్లూ నువ్వు అర్థానుస్వారం లాగ ముద్రాసురిడిలాగ బతికేవు. పేపర్ వెయిట్‌లాగ, రబ్బర్‌స్టాంప్‌లాగ బతికేవు. వెళ్లు జీవితంలోకి!

రెండో రకం పద్యంలో కూడా బాధ ఉంటుంది. కాని అది బతికేబాధ కాదు. బతికించేబాధ కానేకాదు.




సాయంకాలం వీపుమీద సవారీచేస్తూ వచ్చిన కుంటి బిచ్చకుర్రవాడు ఇరుకుసందులో బాడుగను తీసుకున్న "ఈస్ట్ అండ్ వెస్ట్ ఎగుమతి దిగుమతుల కంపెనీ" గుమ్మంముందు నిలబడి "అంబా" అని అరిచాడు.

అమ్మతనానికి చిన్నప్పుడే దూరమై పెంటకుప్పల చాటున పెరిగిన కుంటి కుర్రబిచ్చగాడు సూర్యుడి ప్రవేశం మొదలు చంద్రుడి నిష్క్రమణందాకా, నేలనించి, నీటినించి ఆకాశంద్వారా వ్యాపారంచేసే భవనంముందు ఆకలికణాల కిరణాల ప్రాణాలు కుదిపితే కదిపితే కుములుతూ కమలుతూ గొంతుకలో సగం ఎత్తి "అంబే" అని అరిచాడు.

వ్యాపారసుందరం లోపల రోజంతా తెగవాగిన మోగిన టెలిఫోనులూ టైపురైటర్లూ మూకీభావం వహించాయి. రోజంతా మనుష్యుల్ని మోసిన కుర్చీలు తీరుబాటుగా తమ అరణ్యప్రారంభాలని జ్ఞాపకం చేసుకుంటున్నాయి.

కుర్రి బిచ్చ కుంటివాడు మొర్రో అని అరిచిన అరుపు కుర్చీలకి వినబడింది గాని ఇంట్లో ఎవరూ లేరని చెప్పడానికి గొంతుకలేనివా కుర్చీలు. అంబా అని అరిచిన అబ్బాయి కేకకి ఆదారినే పోతూన్న ఓ గోమాత అతడే తన చేటపెయ్య కాబోలునని అరక్షణం అనుమానించి తెలివైంది కాబట్టి తెలుసుకుని ముభావంగా ముట్టెముడుచుకుని వెళ్లిపోయింది.

ఇక్కడ బిచ్చం దొరకదని ఎవరు చెబుతారు కుర్రాడికి? లక్షలమీద వ్యాపారం జరిగే ఆ భవనంలో ఇప్పుడు వచ్చి మంచినీళ్లుకూడా పుట్టవని టెలిఫోన్లు చెబతాయా? టైపు రైటర్లు చెబతాయా? గదిలోని క్యాలండరు కాగితాలు గాలికి గలగల కొట్టుకుంటున్నాయే గాని ఈ కాస్త కబురూ వాడి కెలా అందజెయ్య గలుగుతాయి?

వొచ్చినపాటుకూడా మరిచిపోయిన బిచ్చ కుంటి కుర్రి వాడి మొగంలో సాయంకాలపు జేగురుకంగు పిచికగూళ్లు కడుతోంది. విసుగుతో పోరాడుతూ అణగారిపోతూన్న ఆకలి ఎగసన దోచుకుంటూన్న కుర్రికుంటి బిచ్చగాడి కడుపులోని

రంపాలు పుట్టిస్తున్నాయి కళ్లలో భూకంపాలు. అసందర్భంగా పుట్టి అనవసరంగా పెరిగి అఘోరిస్తూన్న బిచ్చకుర్రకుంటివాడి పిడచకట్టిపోయిన నాలిక ఓడిపోయిన రాజ్యాలతాలూకు వెలిసిపోయిన పతాకంలాగ వేలాడుతోంది.

అనంతంగా అక్కడే నిలబడిపోతాడా యేమిటా కుర్రాడు? ఈకథ ఎక్కడికీ కదలదా యేమిటి? ఆకదలని కాళ్లు నేలలోకి కూరుకుపోయి వేళ్లుతన్న కుర్రాడే ఒక మర్రిచెట్టయి పోతాడేమిటి?

చింకిరిజుత్తు బికారివాడి తలకాయపెట్టెలోని దరిద్రపు సామాన్లు వర్ణిస్తూ, ఎదురుగుండా కంపెనీ భవనంలోని ఖరీదైన వస్తువుల ఐశ్వర్యాన్ని సూచిస్తూ ఎంతసేపైనా ఈ రచనని సాగించవచ్చు. సందులోసహా సౌందర్యాన్ని రకరకాల ఉపమానాలతో వర్ణించవచ్చు. అయినా ఈకథ ఎక్కడ ప్రారంభమయిందో అక్కడే ఉంటుంది.

ఎప్పటికైనా ఆ బిచ్చగాడు కుంటివాడు కుర్రవాడు తలయెత్తి చూసి తలుపుకివేసిన తాళంకప్ప ఇచ్చే సందేశాన్ని అర్థంచేసుకోగలిగితే, అయ్యా అని అరిచిననోరు అయ్యో అని నిరాశ ప్రకటిస్తే ఆయింటిముందు నిలబడడంవల్ల లాభంలేదని ఆఖరికి కదలనికాళ్లకి బోధపడితే అప్పుడే కథ అంతమవుతుంది.

---

122 పుటలు దాకా మాస్టర్‌మన్ ముద్రాక్షరశాల, కాకినాడ. తక్కినవి
రత్నా పవర్ ప్రెస్, విశాఖపట్నం.

